శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః
శ్రీమతే రామానుజాయ నమః



# ఆదిత్య హృదయం

హృదయరంజనీ వ్యాఖ్యానం


వ్యాఖ్యాత

పండితరత్న, వేదాంతవాచస్పతి, సత్సంప్రదాయసుధాంబుధి
ఉ.వే. శ్రీమాన్ డా ॥ ఈ.ఏ. శింగరాచార్యస్వామి


ఉ.వే. మహావిద్వాన్
శ్రీమాన్ ఈయుణ్ణి శేషశింగరాచార్యస్వామివారి
**114వ తిరునక్షత్రోత్సవ జ్ఞాపిక - 2013**

**ఆదిత్య హృదయం - హృదయరంజనీ వ్యాఖ్యానం**

వ్యాఖ్యాత : ఉ.వే. శ్రీమాన్ డా ॥ ఈ.ఏ. శింగరాచార్యస్వామి

ప్రతులు : 500

అన్నిహక్కులు : వ్యాఖ్యాతవి.

మూల్యము : అమూల్యము

ఆవిష్కరణము : 28-4-2013

సందర్భము : ఉ.వే.శ్రీమాన్ ఈయుణ్ణి శేషశింగరాచార్య స్వామివారి 114వ తిరునక్షత్రోత్సవము

వేదిక : శ్రీభాష్యకార భవనము, నరసాపురం

ముఖచిత్రం : సూర్యప్రభవాహనంలో శ్రీవారు, తిరుమల

ఈగ్రంథం, భగవద్భాగవతాచార్య కైంకర్య నిష్ఠులైన
శ్రీమతి జంపన జానకమ్మ, శ్రీమాన్ జంపన సత్యనారాయణ రాజు
దంపతులు భక్తితో సమర్పించిన ద్రవ్యంతో ముద్రింపబడింది.

శ్రీమతాం శింగరార్యాణా మవతార మహస్కృతిః ।
కృతిః సమర్ప్యతే భక్త్యా సైషా తత్పదసన్నిధౌ ॥

ప్రతులకు : 1) శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్యులు
18-3-58/7, శాంతినగర్, కె.టి.రోడ్, తిరుపతి-7
ఫోన్ : 98850 03420

2) శ్రీ జంపన సత్యనారాయణ రాజు, అంతర్వేదిపాలెం
సఖినేటి పల్లి మండలం, రాజోలు తాలూకా
తూర్పుగోదావరి జిల్లా
సెల్ : 98669 60859

అక్షరయోజనము: శ్రీచంద్రశేఖర్, తిరుపతి

ముద్రణ : సి.యన్. ప్రింటర్స్, తిరుపతి



న్యాయవేదాంతవిద్వాన్
ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యస్వామివారు
భారద్వాజభవనం, కోవెలవీధి, నరసాపురం

## మంగళాశాసనము

ఆదిత్యహృదయం పుణ్యం సర్వశత్రువినాశనమ్ ।
జయావహం జపేన్నిత్య మక్షయ్యం పరమం శివమ్ ॥

"పశ్యేమ శరదశ్శతం, నందామ శరదశ్శతం, మోదామ శరదశ్శతమ్" అని అంటూ వేదపురుషుడు జీవులంతా నూఱు సంవత్సరాల కాలం సుఖంగా, ఆనందంగా జీవించాలని ఆశించాడు, ఆశీర్వదించాడు. తొణ్డరడిప్పొడి ఆళ్వార్లు "వేదనూల్ పిరాయమ్ నూఱు" (వేదశాస్త్రంలో తెలుపబడ్డ మానవజీవితకాలం నూఱు సంవత్సరాలు) అని అన్నారు. భర్తృహరికూడా "ఆయుర్వర్షశతం నృణాం పరిమితమ్" (మానవుల ఆయుఃపరిమితి నూఱేండ్లు) అని అన్నాడు. ఇక్కడ నూఱు అనే సంఖ్యకు అనేకమని అర్థం. ఈ విధంగా పలు వర్షాలపాటు సుఖంగా జీవిస్తూ, భగవానుని ఆజ్ఞారూపాలైన వేదాలు, ధర్మశాస్త్రాలు మొదలైనవానిలో తెలుపబడ్డ ధర్మాలను ఆచరిస్తూ, ఆ భగవానునకు ఆనందాన్ని కల్గించి, అతని కృపకు పాత్రం కావాలని అంటూ వేదం "కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేత్ శతం సమాః" అని తెలిపింది. ఈరీతిలో జీవించేవారు "విణ్ణులారిలుమ్ శీరియరే" అనే విధంగా నిత్యసూరుల కంటే గొప్పవారని దివ్యసూరుల వాక్కు.

శ్రుతిస్మృతివిహితాలైన ఆయా వర్ణాశ్రమధర్మాలను అనుష్ఠించ డానికి నూఱేండ్ల ఆయుస్సు ఒక్కటే చాలదు. ఆరోగ్యవంతమైన శరీరంకూడా కావాలి. "ఆశిష్ఠో ద్రఢిష్ఠో బలిష్ఠః తస్యేయం పృథివీ సర్వా విత్తస్య పూర్ణా స్యాత్" (పూర్ణంగా భుజించగల్గిన, శారీరకమైన బలాన్ని కల, మానసికమైన దృఢత్వాన్ని కల వానికే ఈ పృథివి అంతా సంపదతో నిండినది కాగలదు) అని వేదం పల్కింది. "భద్రం కర్ణేభిః శ్రుణుయామ దేవాః, భద్రం పశ్యేమాక్షభిః యజత్రాః, స్థిరై రంగైః తుష్టువాంసస్తనూభిః, వ్యశేమ దేవహితం యదాయుః" - అనే వైదికసూక్తి ఈ విషయా లను తెల్పుతున్నది. "శరీర మాద్యం ఖలు ధర్మసాధనమ్" (శరీరం ధర్మసాధనాలలో మొదటిది కదా) అని మహాకవి కాళిదాసు అన్నాడు. అందువల్ల ఆరోగ్యవంతమైన శరీరాన్ని సాధనంగా చేసికొని ప్రతివ్యక్తి వేదోక్తమైన ధర్మమార్గాన్ని అనుసరించి భగవానుని అనుగ్రహానికి పాత్రుడు కావాలి.

ఈ ఆరోగ్యం ఎవరివల్ల ఏవిధంగా లభిస్తుంది? అని గమనించినపుడు, "ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్" (ఆరోగ్యాన్ని సూర్యునివల్ల కోరాలి) అనే సూక్తి మదిలో మెదులుతుంది. సూర్యుడు ఆరోగ్య ప్రదాత. సూర్యుని ఆరాధనవల్ల ఆరోగ్యం, బలం, తేజస్సు, ఉత్సాహం కల్గుతాయి. మయూరుడు అనే సంస్కృతకవి సూర్యభగవానుని స్తుతిస్తూ సూర్యశతకమనే కృతిని రచించి తనకు కల్గిన వ్యాధిని పోగొట్టుకొన్న వృత్తాంతం సుప్రసిద్ధం.

ఈవిధంగా ఆరోగ్యప్రదాతయైన సూర్యుని స్తుతించే స్తోత్రాలు అనేకం ఉన్నప్పటికి, వాటిలో శ్రీరామాయణంలోని ఆదిత్యహృదయం అనే స్తోత్రం చాలా విలక్షణమైనది, గొప్ప మహిమ కలిగినది. మర్యాదాపురుషోత్తముడైన శ్రీరామునిచే అనుసంధింపబడిన అతిశయాన్ని కల్గినది. ఈ స్తోత్రం పైపైన సూర్యుని కీర్తించే స్తుతిగా కన్పించినా, తత్త్వదృష్టిలో గమనించినప్పుడు ఈ స్తుతిలోని నామాలన్నీ ఆదిత్యమండలంలో అంతర్యామిగా వేంచేసియుండే భగవానుడైన శ్రీమన్నారాయణుని నామాలు. ఆదిత్యహృదయం అంటే ఆదిత్యునిలో అంతర్యామిగా వేంచేసి ఉండే శ్రీమన్నారాయణుడే. ఇటువంటి గొప్ప స్తుతిని పఠించి ఆరోగ్యం మొదలైన శుభాలను పొందినవారు ఎంతోమంది ఉన్నారు. ఈ స్తుతి ఇప్పుడు తెలుగు వివరణంతో ముద్రింపబడడం, ఆ ముద్రణకూడా దాసుని పితృచరణులు ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి శేషశింగరాచార్య స్వామివారి తిరునక్షత్రోత్సవ సందర్భ జ్ఞాపికగా చేయబడడం చాలా ఆనందదాయకమైన విషయం. ఈ ముద్రణకు కావలసిన ద్రవ్యాన్ని భక్తి శ్రద్ధలతో సమర్పించిన శ్రీమతి జంపన జానకమ్మ, శ్రీమాన్ జంపన సత్యనారాయణ రాజు దంపతులకు మంగళాశాసనాలను చేస్తున్నాను. వీరి కుటుంబం తరతరాలుగా శ్రీరామానుజ సంప్రదాయాన్ని అనుసరించే భాగవత కుటుంబం. వీరి ఈ సంప్రదాయ శ్రద్ధ మరింత అభివృద్ధి కావాలని, వీరి కుటుంబానికి శ్రీ ఆదికేశవ స్వామి, శ్రీ ఎంబెరుమానార్ స్వామివార్ల దివ్యానుగ్రహంతో సకల శుభాలు సమకూరాలని హృదయపూర్వకంగా ఆశిస్తున్నాను. శ్రీమాన్ జంపన సత్యనారాయణ రాజుగారు ఈ గ్రంథాన్ని తమ తల్లిదండ్రులైన శ్రీమతి వెంకాయమ్మ, శ్రీమాన్ రంగరాజుగార్ల దివ్యస్మృతిగా ముద్రింపచేయడం మరింత హర్షించదగిన విషయం. ఆదిత్య హృదయాన్ని వ్యాఖ్యానించిన చిరంజీవి శ్రీమాన్ శింగరాచార్యులకు మంగళాశాసనాలను చేస్తున్నాను. ఆస్తికులైన పాఠకులు ఈ గ్రంథాన్ని సద్వినియోగం చేసికొంటారని ఆశిస్తున్నాను. స్వస్తి

నరసాపురం ఇట్లు
**17-4-2013** ఈయుణ్ణి రంగాచార్యులు



# పీఠిక

ఆదిత్యహృదయాంతస్థో దేవో నారాయణః ప్రభుః ।
విద్యాసహాయవానస్మాన్ హరీ రక్షతు కుండలీ ॥

ఈ లోకంలో రాత్రివేళ వ్యాపించిన చీకట్లను పారదోలి, అందరికి చైతన్యాన్ని, స్ఫూర్తిని పొందించి. ఆరోగ్యాన్ని కల్గించే మహనీయుడు ఆదిత్యుడు. ఈ లోకం కాలానుగుణమైన పరిణామాన్ని కల్గినది, ఆ కాలానికి నిర్వాహకుడు సూర్యుడు. "చక్షోః సూర్యో అజాయత" అని అంటూ పురుషసూక్తం విశ్వరూపుడైన పరమాత్మ యొక్క చక్షుస్సునుండి సూర్యుడు ఉద్భవించినట్లు తెల్పుతున్నది. "చంద్రసూర్యౌ చ నేత్రే" అని ఇతిహాసోక్తి. "స ఆత్మా, అంగాన్యన్యా దేవతాః" అని అంటూ తైత్తిరీయోపనిషత్తు భగవానునకు మిగిలిన దేవతలంతా అంగాలని పేర్కొన్నది కదా!

దేవతలలో ప్రముఖులు ముప్పై మూడుమంది. "ఏతే త్రయస్త్రింశద్దేవాః" అని బృహదారణ్యకోపనిషత్తు, "ముప్పత్తు మూవర్ అమరర్" అని గోదాదేవి, "ఎణ్మర్ పదినారువర్ ఈరఋవర్ ఓరిరువర్" అని పొయ్కై ఆழ்వార్లు ఈ విషయాన్ని తెలిపారు. ఏకాదశ రుద్రులు **(11)**, ద్వాదశాదిత్యులు**(12)**, అష్టవసువులు **(8)**, అశ్వినీ దేవతలు ఇద్దరు **(2)** -మొత్తం ముప్పై ముగ్గురు దేవతలు ప్రధానులు. పన్నెండుమంది ఆదిత్యులు ఒక్కొక్కనెల ఒక్కొక్కరు చొప్పున సూర్యమండలానికి వాసస్థానమైన రథంలో ఉంటారు. ఈ ఆదిత్యులతోపాటు పన్నెండుమంది ఋషులు, ఒక్కొక్కరు ఒక్కొక్కమాసంలో సూర్యరథంలో ఉండి వేదాధ్యయనపరులై స్తుతిస్తారు. పన్నెండు మంది గంధర్వులు గానాన్ని చేస్తారు. పన్నెండుమంది అప్సరసలు నాట్యం చేస్తారు. పన్నెండుమంది యక్షులు ఏడు గుఱ్ఱాలను పట్టుకొని ఉంటారు. పన్నెండుమంది నాగాలు సూర్యరథానికి పగ్గాలుగా ఉంటారు. పన్నెండుమంది రాక్షసులు అనుచరులై ఉంటారు. ఈ విధంగా ఆయా మాసాలలోని ఆదిత్యులు, ఋషులు, గంధర్వులు, అప్సరసలు, యక్షులు, నాగులు, రాక్షసులు- అనే ఏడుమంది చైత్రం మొదలు ఫాల్గునంవరకు గల పన్నెండు నెలలలో సూర్యరథ గమనాన్ని నిర్వహిస్తారు. చైత్రాదిమాసాలలో సూర్యరథాన్ని నడిపే ఆదిత్యాదులు ఏడుమంది వివరం శ్రీవిష్ణుపురాణంలో, కూర్మపురాణంలో తెలుపబడింది. దీనిని అழகియమణవాళప్పెరుమాళ్‌నాయనార్ అనే పూర్వాచార్యులు తత్త్వనిరూపణ మనే గ్రంథంలోని అయిదవ అధికారంలో

వివరించారు.

ద్వాదశాదిత్యులు - "ధాతా-ర్యమా చ మిత్రశ్చ వరుణశ్చేంద్ర ఏవ చ, వివస్వాంస్తథ పూషా చ పర్జన్యశ్చాంశ ఏవ చ, భగస్త్వష్టా చ విష్ణు శ్చ ఆదిత్యా ద్వాదశా స్మృతాః" అనే విష్ణుపురాణసూక్తినిబట్టి ధాత, అర్యముడు, మిత్రుడు, వరుణుడు, ఇంద్రుడు, వివస్వాన్, పూషా, పర్జన్యుడు, అంశుడు, భగుడు, త్వష్ట, విష్ణువు -అనేవారు ద్వాదశాదిత్యులు. (ఈ పేర్లలో కొంత వ్యత్యాసం ఆయా పురాణ వచనాలలో కన్పడుతున్నది)

చైత్రాది ఆయా మాసాలలోని ఆదిత్యాది సప్తగణాల వివరాన్ని కూర్మపురాణం పూర్వభాగం ఈవిధంగా తెలియజేసింది.

1. చైత్రమాసంలో ధాతా అనే ఆదిత్యుడు, కృతస్థల అనే అప్సరస, పులస్త్యుడనే ఋషి, వాసుకి సర్పం, రథభృత్ అనే యక్షుడు, హేతి అనే రాక్షసుడు, తుంబురుడనే గంధర్వుడు - అనే ఈ ఏడుగురు మధుమాసమనబడే చైత్రమాసంలో ఆదిత్య మండలాన్ని అధిష్ఠించి ఉంటారు.

2. అర్యముడు అనబడే ఆదిత్యుడు, పులహుడనే ఋషి, రథౌజా అనే యక్షుడు, పుంజికస్థల అనే అప్సరస, ప్రహేతి అనే రాక్షసుడు, కచ్ఛవీరుడనే సర్పం, నారదుడనే గంధర్వుడు- అనే ఏడుగురు మాధవమనబడే వైశాఖమాసంలో ఆదిత్యమండలాన్ని అధిష్ఠించి ఉంటారు.

3. మిత్రుడనే ఆదిత్యుడు, అత్రి అనబడే ఋషి, తక్షకుడనే సర్పం, పౌరుషేయుడనే రాక్షసుడు, మేనక అనే అప్సరస, హాహా అనే గంధర్వుడు, రథస్వనుడనే యక్షుడు -అనే ఈ ఏడుగురు శుచి అనబడే జ్యేష్ఠమాసంలో ఆదిత్యమండలాన్ని అధివసించి ఉంటారు.

4. వరుణుడనే ఆదిత్యుడు, వసిష్ఠుడనే ఋషి, సహజన్య (రంభ)అనే అప్సరస, హూహూ - అనే గంధర్వుడు, వధుడనే రాక్షసుడు, రథచిత్రుడనే యక్షుడు, అశ్వాదుడనే సర్పం - అనే ఏడుగురు శుక్రమనబడే ఆషాఢమాసంలో ఆదిత్య మండలాన్ని అధివసించి ఉంటారు.

5. ఇంద్రుడనే ఆదిత్యుడు, విశ్వావసువు అనే గంధర్వుడు, స్రోత అనే యక్షుడు, ఏలాపుత్రుడనే సర్పం, అఙ్గిరా అనే ఋషి, ప్రమ్లోచ అనే అప్సరస, సర్పుడనే రాక్షసుడు- అనే ఏడుగురు నభస్సు అనే శ్రావణమాసంలో ఆదిత్యమండలాన్ని అధివసించి ఉంటారు.



6. వివస్వాన్ అనే ఆదిత్యుడు, ఉగ్రసేనుడనే గంధర్వుడు, భృగువనే ఋషి, ఆ పూరణుడనే యక్షుడు, అనుమ్లోచ అనే అప్సరస, శంఖపాలుడనే సర్పం, వ్యాఘ్రుడనే రాక్షసుడు- అనే ఈ ఏడుగురు నభస్యమనబడే భాద్రపదమాసంలో ఆదిత్య మండలాన్ని అధివసించి ఉంటారు.

7. పూషా అనే ఆదిత్యుడు, వసురుచి అనే గంధర్వుడు, వాతుడనే రాక్షసుడు, గౌతముడనే ఋషి, ధనంజయుడనే సర్పం, సుషేణుడనే యక్షుడు, ఘృతాచి అనే అప్సరస - అనే ఏడుగురు ఇషమనబడే ఆశ్వయుజ మాసంలో ఆదిత్య మండలాన్ని అధివసించి ఉంటారు.

8. విశ్వావసువు అనే ఆదిత్యుడు, భరద్వాజుడనే ఋషి, పర్జన్యుడనే గంధర్వుడు, ఐరావతమనబడే సర్పం, విశ్వాచి అనే అప్సరస, సేనజిత్ అనే యక్షుడు, ఆపసుడనే రాక్షసుడు- అనే ఈ ఏడుగురు ఊర్జమనే కార్తికమాసంలో ఆదిత్యమండలాన్ని అధివసించి ఉంటారు.

9. అంశుడనే ఆదిత్యుడు, కాశ్యపుడునే ఋషి, తార్క్ష్యుడనే యక్షుడు, మహాపద్ముడనే సర్పం, ఊర్వశి అనే అప్సరస, చిత్ర సేనుడనే గంధర్వుడు, విద్యుత్ అనే రాక్షసుడు- అనే ఈ ఏడుగురు సహమనబడే మార్గశీర్షమాసంలో ఆదిత్యమండలాన్ని అధివసించి ఉంటారు.

10. భగుడనే ఆదిత్యుడు, క్రతువనే ఋషి, ఊర్ణాయువు అనే గంధర్వుడు, స్ఫూర్జుడనే రాక్షసుడు, కార్కోటకుడనే సర్పం, అరిష్టనేమి అనే యక్షుడు, పూర్వచిత్తి అనే అప్సరస- అనే ఏడుగురు సహస్యమనే పుష్యమాసంలో ఆదిత్యమండలాన్ని అధిష్ఠించి ఉంటారు.

11. త్వష్ట అనే ఆదిత్యుడు, జమదగ్ని అనే ఋషి, కంబళుడనే సర్పం, తిలోత్తమ అనే అప్సరస, బ్రహ్మోపేతుడనే రాక్షసుడు- రథజిత్తు అనే యక్షుడు, ధృతరాష్ట్రుడనే గంధర్వుడు- అనే ఈ ఏడుగురు తపస్సు అనే మాఘమాసంలో ఆదిత్యమండలాన్ని అధివసించి ఉంటారు.

12. విష్ణువు అనే ఆదిత్యుడు, విశ్వామిత్రుడనే ఋషి, అశ్వతరుడనే సర్పం, రంభ అనే అప్సరస, సూర్యవర్చస్సు గంధర్వుడు, సత్యజిత్తు అనే యక్షుడు,

యజ్ఞోపేతుడనే రాక్షసుడు- అనే ఈ ఏడుగురు తపస్యమనబడే ఫాల్గునమాసంలో ఆదిత్యమండలాన్ని అధిష్ఠించి ఉంటారు. ఆదిత్యుడు మండలాధిపతి అతడు ప్రధానుడు. మిగిలినవారు అతనిని అనుసరిస్తారు. ఆ ఆదిత్యుని హృదయంలో అంతర్యామిగా పరమాత్మ అయిన శ్రీమన్నారాయణుడు వేంచేసి ఉంటాడు. ఇతనిని "య ఏషోంతరాదిత్యే", "య ఆదిత్యే తిష్ఠన్... ఆదిత్యమంతరో యమయతి" ఇత్యాదిగా వేదం, "ధ్యేయస్సదా సవితృమండల మధ్యవర్తీ" ఇత్యాదిగా పురాణం, "ఇడమ్ వలమేழ் పూణ్డ ఇరవిత్తేరోట్టి" అని దివ్యసూరులు కీర్తించారు. ఇతడే "ఉత్" అనే నామాన్ని కలవాడు. గాయత్రీ మంత్రంచే తెలియబడేవాడు. తిరువాయ్మొழி ప్రబంధప్రతిపాద్యుడు. ఆదిత్య మండలాంతర్వర్తి నేత్రాలు నిండైన నీటిలో పుట్టిన, చక్కని బలమైన కాడను కల, సూర్యుని కిరణాలచే వికసించిన ఎర్రతామర పూల రేకుల వలె అందంగా ఉంటాయి. దీనిని ఛాందోగ్యోపనిషత్తు "తస్య కప్యాసం పుండరీకమేవమక్షిణీ" అని పల్కింది. ఈ శ్రుతిని వివరించే సందర్భంలోనే శ్రీరామానుజులకు, యాదవ ప్రకాశకులకు మధ్య అభిప్రాయభేదం ఏర్పడింది. ఈ అభిప్రాయభేదమే తర్వాతికాలంలో శ్రీరామానుజులు బాదరాయణ ప్రణీతాలైన బ్రహ్మసూత్రాలకు విశిష్టాద్వైత సిద్ధాంతపరంగా శ్రీభాష్యమనే అద్భుతమైన వ్యాఖ్యానాన్ని రచించడానికి కారణమైనది. అందువల్ల ఆదిత్యమండలాంతర్వర్తికి, విశిష్టాద్వైత సిద్ధాంతానికి అవినాభావసంబంధం ఉన్నవి.

శ్రీ విష్ణుపురాణంలో ద్వాదశాదిత్యుల జన్మనుగూర్చిన వివరం కన్పడు తున్నది. దక్షుడు తన కుమార్తెలు పదమూడుమందిని కశ్యపప్రజాపతికి ఇచ్చి వివాహం చేశాడు. వారిలో అదితి ఒకరు. ఈమెకు కశ్యపునివల్ల కల్గిన సంతానమే ద్వాదశాదిత్యులు. చాక్షుషమన్వంతరంలోని తుషితులనే పన్నెండుమంది దేవతలు (ఇప్పటి మన్వంతరమే వైవస్వతమన్వంతరం. ఇది వైవస్వత మనువుతో ప్రారంభమైన కాలం) తమలో తాము ఆలోచించుకొని వైవస్వతమన్వంతరంలో ఆదితికి పుత్రులై జన్మించాలని నిశ్చయించుకొన్నారు. వారు ద్వాదశాదిత్యులుగా జన్మించారు - అని శ్రీ విష్ణుపురాణం ప్రథమాంశలోని పదిహేనవ అధ్యాయంలో తెలుపబడింది.

ఈ విధంగా ఆదిత్యులు మొదలైనవారు భగవద్భక్తివల్ల వృద్ధిని పొందినవారై వేదరూపమై, భగవద్భక్తిమయమైన ఆదిత్యమండలాన్ని ఆశ్రయించి ఉంటారు. వీరు ఏడుమందిలో ఆదిత్యులు ప్రధానులు. మిగిలినవారు అతనిని అనుసరిస్తారు.



ఆ ఆదిత్యుల హృదయంలో ఉపాస్యుడైన శ్రీమన్నారాయణుడు "విద్యా సహాయ వంతం మామాదిత్యస్థం సనాతనమ్, కపిలం ప్రాహురాచార్యాః సాంఖ్య యోగవిచక్షణాః " (మహాభారతమ్ - శాంతిపర్వం - మోక్షధర్మం-347-69) అని చెప్ప బడిన రీతిలో ఎఱ్ఱని వర్ణాన్ని కలవాడై, 'విద్యా' అనే పేరును కల లక్ష్మితో కూడిన వాడై, బంగారు వన్నెవంటి వన్నెతో ప్రకాశించే మేనిని కలవాడై, "నీలతోయదమధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్కరా" అని ఉపనిషత్తులో చెప్పబడిన రీతిలోని ఆకర్షణీయమైన కాంతిని కలవాడై, దానినికూడా మింగి వేసే లోహితవర్ణాన్ని కల శ్రీసుదర్శనుని కాంతివల్ల (ఈవిధంగా ఎఱ్ఱని, నల్లని, రోహితవర్ణాల కలయికవల్ల) కాపిలవర్ణాన్ని (ఈ మూడు వర్ణాల కలయిక వల్ల ఏర్పడే గోరోజనం రంగును) కలవాడైనందున "కపిలు"డనే పేరును కలవాడై ఉంటాడు. "వలమేழ் పూణ్ పూణ్డ ఇరవిత్తేరోట్టి వడముక వేజ్గడత్తు మన్నుమ్" అని అంటూ పేయாழ்వార్లు భగవానుడే ఆదిత్యాంతర్వర్తియై సూర్యాశ్వాల ఏడింటి గమనాన్ని శాస్తిస్తున్నాడని అన్నారు. ఈవిధంగా సూర్యునకు అంతర్యామియై ఉండే ఈ శ్రీమన్నా రాయణుడు మూడు సంధ్యలలో ధ్యానింపబడుతున్నాడు. ఈ మూర్తియొక్క తత్త్వాన్ని తెలిపే మహామంత్రాత్మకమైన స్తోత్రమే ఆదిత్య హృదయం.

చైత్రమాసానికి మూలమైన చిత్రానక్షత్రానికి అధిదేవత త్వష్ట, వైశాఖ మాసానికి మూలమైన విశాఖకు అధిదేవతలు ఇంద్రాగ్నులు, జ్యేష్ఠమాసానికి కారణమైన జ్యేష్ఠకు అధిదేవత ఇంద్రుడు, ఆషాఢమాసానికి కారణమైన పూర్వాషాఢకు అధి దేవత అప్‌దేవతలు. శ్రావణమాసానికి మూలమైన శ్రవణానికి అధిదేవత విష్ణువు, భాద్రపద మాసానికి మూలమైన ఉత్తరాభాద్రకు అధిదేవత అహిర్బుధ్న్యుడు, ఆశ్వయుజ మాసానికి మూలమైన అశ్వినికి అధిదేవతలు అశ్వినీదేవతలు, కార్తీక మాసానికి మూలమైన కృత్తికకు అధిదేవత అగ్ని, మార్గశీర్ష మాసానికి మూలమైన మృగశిరకు అధిపతి సోముడు, మాఘమాసానికి మూలమైన మఘకు అధిపతి పితృదేవతలు- అని వేదంలో తెలుపబడింది. ఈ అధిదేవతల నామాలన్నీ ప్రకృత స్తోత్రంలో ఆదిత్య మండలాంతర్వర్తి అయిన భగవానుని వాచకాలుగా ప్రయోగింప బడడం మఱి ఒక విశేషం. ఇంతేకాక, భగవద్గీతలోని విభూత్యధ్యాయంలో (10వ అధ్యాయంలో) భగవదంశరూపాలుగా నిర్దేశింపబడిన విష్ణు, రవి, మరీచి, శశి (సోమ), శంకర, విత్తేశ (ధనద), పావక (వహ్ని), స్కంద, వరుణ, యమ, పవన (వాయు), కాలశబ్దాలన్నీ ఈ స్తోత్రంలో కన్పిస్తాయి. దీనినిబట్టికూడా ఈ స్తుతిలోని

ఆదిత్య నామాలు అన్నీ భగవానుడైన శ్రీమన్నారాయణుని వాచకాలు అని తెలుస్తున్నది.

భక్తితో పరమాత్మను ఉపాసించే పలు మార్గాలను వేదం తెలిపింది. వాటికే బ్రహ్మ విద్యలనిపేరు. వీటిలో అంతరాదిత్యవిద్య ఒకటి. ఛాందోగ్యోపనిషత్తులో అంతరాదిత్యవిద్య అనే బ్రహ్మవిద్య తెలుపబడింది. ఈ విద్యలో సూర్యమండలం లోని ఆదిత్యునకు అంతరాత్మగా వేంచేసి ఉండే భగవానుని ఉపాసనారీతి తెలుపబడింది. “య ఏషోంతరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే, హిరణ్యశ్మశ్రుః హిరణ్యకేశః ఆప్రణఖాత్ సర్వ ఏవ సువర్ణః. తస్య యథా కప్యాసం పుండరీకమేవ మక్షణీ, తస్యోదితినామ” (ఆదిత్యమండలంలో బంగారు వన్నెను కల్గిన, బంగారు రంగులోని మీసాలను, కేశాలను కల్గి, నఖపర్యంతం అంతా సువర్ణమయుడైన ఏ పురుషుడు ఉన్నాడో, అతనికి సూర్యుని కిరణాలతో వికసించిన పద్మాలవంటి రెండు కన్నులున్నాయి. అతనికి “ఉత్” అని పేరు) అనే ఛాందోగ్యోపనిషద్వాక్యం ఈ అంతరాదిత్య విద్యను తెల్పుతున్నది. “వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే, వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా” (వేదంచేత తెలియదగిన పరమపురుషుడు దశరథునకు కుమారుడైన జన్మించగా, వేదం వాల్మీకి ముని ద్వారా సాక్షాత్తు శ్రీరామాయణంగా ఆవిర్భవించింది) అనే సూక్తి వేదం శ్రీరామాయణంగా అవతరించిందని తెల్పు తున్నది. ఆ వేదంలో ఉపదేశింపబడ్డ అంతరాదిత్యవిద్యను ఈ ఆదిత్యహృదయ మనే స్తోత్రం బోధిస్తున్నది. ఈ అంతరాదిత్యవిద్యను “ఇడమ్ వలమే*ళ్* పూణ్డ ఇరవిత్తేరోట్టి వడముక వేఙ్గడత్తు మన్నుమ్” అని అంటూ పేయాళ్వార్లు, “శెయ్యదోర్ ఞాయి*ఱ్ఱై*క్కట్టి శిరీదరన్ మూర్త్తి యీ దెన్నుమ్” (ఎఱ్ఱని అద్వితీయమైన సూర్యుని చూపించి, “ఇది శ్రీధరునిమూర్తి” అని అని పరాంకుశ నాయకి అంటున్నది) అని నమ్మాళ్వార్లు, “వేఙ్గడన్ కోయిల్కొణ్డ అతనొడుమ్ వానిడై అరుక్కన్ మేవి నిఱ్పాఱ్కు అడిమై త్తొ*ళ్*ిల్ పూణ్డాయే” (పెరియ తిరుమొ*ళ్*ి-2-1-7) అని తిరుమంగైమన్నన్ తెలియజేశారని సర్వజ్ఞులైన పూర్వా చార్యులు ఈ సూక్తులను వ్యాఖ్యానించడం ఇక్కడ స్మరించదగిన అంశం.

శ్రీరామాయణం యుద్ధకాండలో ఇది 107వ సర్గ. దీనిని అగస్త్యుడు శ్రీరామునకు ఉపదేశించిన సందర్భాన్ని గమనించాలి. శ్రీరాముడు రావణునితో చాలా సేపు గొప్ప యుద్ధం చేశాడు. ఆ యుద్ధాన్ని చూడడంకోసం దేవతలతోపాటు



భగవానుడైన అగస్త్యమహర్షికూడా వచ్చాడు. శ్రీరామునితో పోరాడి అలసిన రావణుడు రామబాణాలకు మూర్ఛపోయాడు. అపుడు రావణుని సారథి యుద్ధరంగంనుండి అతనిని పక్కకు తీసికొనిపోయాడు. కొంతసేపటికి తెప్పరిల్లిన రావణుడు యుద్ధరంగం నుండి తనను పక్కకు తప్పించిన సారథిని నిందించాడు. శత్రువులను సైతం రంజింపజేసే శ్రీరాముని ముందుకు మళ్ళీ తనను తీసికొని పొమ్మని అతనిని ఆజ్ఞాపించాడు. అతని సారథి ఆవిధంగానే చేశాడు. అపుడు రావణుని ఏ రీతిలో సంహరించాలి? అనే చింతతో ఉండే శ్రీరామునకు అగస్త్యుడు ఈ ఆదిత్యహృదయాన్ని ఉపదేశించాడు. కురుక్షేత్ర మహాసంగ్రామారంభంలో కింకర్తవ్యతావిమూఢుడైన అర్జునునకు భగవానుడైన శ్రీకృష్ణుడు ఉపనిషత్సారమైన భగవద్గీతను ఉపదేశించాడు. ఇక్కడ రామరావణ యుద్ధం చివరి ఘట్టంలో రావణవధనుగూర్చి చింతించే శ్రీరామునకు ఛాందోగ్యోపనిషత్ సిద్ధమైన అంతరాదిత్యవిద్యను భగవానుడైన అగస్త్య మహర్షి ఉపదేశించాడు.

విష్ణుసహస్రనామంలో ఆదిత్యశబ్దం రెండుమార్లు పఠింపబడింధి (39వ నామం, 568వ నామంగా) మొదటి ఆదిత్యనామం ఆదిత్యమండలాన్ని అధివసించి ఉండే శ్రీమన్నారాయణుని పరంగా భట్టర్ వ్యాఖ్యానించారు. ఆదిత్య మండలవర్తి అయన ఈ పరమాత్మను “మహాస్వనః” అనే (41వ) ఇంకొక నామం తెలుపు తున్నది. ఈనామానికి “గొప్ప అనగా పూజ్యమైన”, “ఉత్” అనే నామాన్ని కలవాడని అర్థం. ఈ నామాన్ని వ్యాఖ్యానించేటపుడు భట్టర్ “సైషా త్రయ్యేవ విద్యా తపతి య ఏషోంతరాదిత్యే హిరణ్మయః పురుషః” అనే వేదవాక్యాన్ని ప్రమాణంగా ఉదాహరించారు. ఈ వాక్యంవల్ల ఋగ్యజుస్సామరూపమైన వేదత్రయం సూర్య మండలవర్తి అయిన భగవానుడు తెల్పుతున్నదని తెలుస్తున్నది. ఈ విధంగా వేదస్వరూపుడైన, ఆదిత్యమండలమధ్యవర్తి అయిన భగవానుని స్తుతించే ఆదిత్య హృదయస్తోత్రం వేదత్రయసారమని చెప్పవచ్చును కదా!

ఇక్కడ ఒక శాస్త్రీయమైన విషయం గమనార్హం. “పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయాత్ -- స గురుమేవాభిగచ్ఛేత్” (కర్మవశమైన లోకాలను చూచి బ్రాహ్మణుడు నిర్వేదాన్ని పొందాలి. అప్పుడు అతడు ఆచార్యునివద్దకు సదుపదేశం పొందడం కోసం వెళ్ళాలి) అని అంటూ ఉపదేశాన్ని పొందే శిష్యునకు నిర్వేదం కల్గడం పూర్వ యోగ్యతగా వేదం తెల్పింది. ఆ గురువు, “శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్” (శ్రోత్రియుడై - వైదికుడై, పరబ్రహ్మపట్ల నిశ్చలమైన నిష్ఠను కలవాడై)

ఉండాలని కూడా పల్కింది. అర్జునునకు శ్రీకృష్ణభగవానుడు గీతోపదేశాన్ని చేసినపుడు అర్జునుడు "అస్థానస్నేహకారుణ్యధర్మాధర్మ" చింతతో కూడినవాడు కదా. అదేవిధంగా ప్రకృతంలో శ్రీరాముడు కూడా "సమరే చింతయా స్థితమ్" అనేరీతిలో రావణుని వధను గూర్చిన చింతను పొందాడు. ఆదిత్యహృదయాన్ని ఉపదేశించే ఆగస్త్యుడు "అగస్త్యో భగవాన్ ఋషి" అని అంటూ నిర్దేశింపబడడంవల్ల ఆ మహర్షికి గల యోగ్యత సూచింపబడింది. ఈవిధంగా ఆదిత్యహృదయ మంత్రోపదేశాన్ని చేసే ఆగస్త్యుడు, ఆ ఉపదేశాన్ని గ్రహించే శ్రీరాముడు - ఇద్దరు వేదోక్తమైన అర్హతలను కల్గినవారు - అని తెలుస్తున్నది.

"ధన్యతే ప్రార్థ్యతే, ధన-ధాన్యే ప్రార్థనాయాం చ" అనే వ్యుత్పత్తిని కల ధనుశ్శబ్దం "ధనుః" అని పుంలింగంలో కూడా ప్రయోగింపబడుతున్నది. ఇందులకు "ధనుర్వంశ విశుద్ధో-పి నిర్గుణః కిం కరిష్యతి" అనే ప్రయోగం గురుబాలప్రబోధికలో ఉదాహరణంగా చూపబడింది. "ధనుః" అంటే ప్రార్థింపబడేవాడని అర్థం. అంతరమంటే మధ్యభాగం. అందులో ఉండేవాడు "అంతరి". అందువల్ల ప్రార్థింప బడే సూర్యమండలం మధ్యలో వేంచేసి ఉండే పరమాత్మయే ధన్వంతరి నామధేయుడు. ఇతడే క్షీరసాగరమథన సందర్భంలో అమృత కలశాన్ని హస్తాలలో ధరించి అవతరించాడు. "ఆదిత్యాంతఃస్థితం విష్ణుం శంఖచక్ర గదాధరమ్, దైత్యారిం సుమనఃసేవ్యం వందే ధన్వంతరిం హరిమ్, మథ్నంతం క్షీరధిం దేవైః వహంతం మందరం గిరిమ్, ఆవిర్భూతం సుధావల్ల్యా వందే ధన్వంతరిం హరిమ్" అనే ధన్వంతర్యష్టక స్తోత్రంలోని శ్లోకాలు ఈ విషయాలను తెలుపుతున్నవి. ఇతడు ఆయురారోగ్య ప్రదాత అనే విషయం "ఆరోగ్యం దీర్ఘమాయుష్యం బలం తేజో ధియం శ్రియమ్, స్వభక్తేభ్యో-నుగృహ్ణంతం వందే ధన్వంతరిం హరిమ్" అనే ఆ స్తుతిలోని ఇంకొక శ్లోకం తెల్పుతున్నది.

మఱి ఒక విశేషంకూడా విన్నపింపబడుతున్నది. "స యశ్చాయం పురుషే, యశ్చాసా వాదిత్యే స ఏకః" అని అంటూ తైత్తిరీయోపనిషత్తు పురుషునిలో అంతర్యామి, ఆదిత్య మండలాంతర్వర్తి ఒకరేనని తెల్పింది. "అంతస్థం సర్వభూతేషు చరంతం విద్యయా సహ" అని హరివంశపురాణ వచనం (3-18-27), "విద్యాసహాయవంతం మామాదిత్యస్థం సనాతనమ్" అనే మహాభారతాంతర్గత నారాయణీయవచనాలను (6-61) బట్టి, "ఇత్యేవమాదిభి స్తేన స్తూయమాన స్స వై రవి, వాజిరూపధరః ప్రాహ వీయతామితి వాంఛితమ్" (విష్ణు. పు-6-4-25) అనే



వచనాలనుబట్టి విద్యాశబ్ద వాచ్యురాలైన లక్ష్మీదేవితో కలసి ఆదిత్యునిలో వేంచేసి ఉండే భగవానుడు వాసుదేవ మూర్తి, మధుసూదనశబ్దవాచ్యుడైన హయగ్రీవుడేనని తెలుస్తున్నది. పురుషునిలో అంతర్యామిగా ఉండేవాడు, సూర్యమండలాంతర్వర్తి - అనే ఇద్దఱి ఐక్యాన్ని నమ్మాళ్వార్లు కూడా తిరువాయ్‌మొళి ప్రబంధప్రారంభపాశురంలో తమ హృదయం లో వేంచేసి ఉండే పరమాత్మను ప్రస్తావించి, ఆదిత్య మండలాంతర్వర్తిని నిర్దేశించే "ఉత్" అనే నామంలోని అక్షరాలను ఆ ప్రబంధం మొదట, చివరలో ప్రత్యాహార న్యాయంతో నిక్షిప్తం చేయడంద్వారా సూచించారు.

శ్రీగోవిందరాజులనే ఉభయవేదాంతపండితులు శ్రీరామాయణానికి శ్రీరామాయణ భూషణమనే. గొప్ప వ్యాఖ్యను రచించారు. వీరు 16వ శతాబ్దిని చెందిన శ్రీశఠకోప జీయర్ శిష్యులు. వీరు, ఈ వ్యాఖ్యను తిరుమల క్షేత్రంలో శ్రీవేంకటేశ్వరుని దివ్యాలయాలనికి ఎదురుగా ఉండే బేడి ఆంజనేయస్వామి సన్నిధి వద్ద రచించినట్లు సంప్రదాయ కథనం. ఆదిత్యహృదయస్తోత్రంలో ఆదిత్యుని స్తుతిస్తూ తెలుపబడ్డ నామాలను ఈ వ్యాఖ్యాత శ్రీమన్నారాయణపరంగా వ్యాఖ్యానించి, ఈ స్తుతి కేవలం ఆదిత్యునకు చెందినది కాదని, ఆదిత్యునకు అంతర్యామిగా వేంచేసి ఉండే శ్రీమన్నారాయణుని ఉద్దేశించినదని, ఇందులోని నామాలు పరమాత్మ వాచకాలని తెలియజేశారు. ఈవిధంగానే మహేశ్వరతీర్థులు, తిలక వ్యాఖ్యానకారులు, తనిశ్లోకి వ్యాఖ్యాత - అందరూ ఈ స్తోత్రం ఆదిత్యమండలవర్తియైన, భగవానుడైన శ్రీమన్నారాయణుని స్తుతిస్తున్నదని వివరించారు. అందువల్ల "ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్" అని అంటూ ఆరోగ్యంకోసం ఆదిత్యుని ఉద్దేశించి చేసే ఆరాధన తదంతర్యామియైన భగవానుని ఆరాధనలోకే పర్యవసిస్తుందని, ఆశించిన ఆరోగ్యాన్ని భగవానుడైన శ్రీమన్నారాయణుడు ఆదిత్యునిద్వారా అనుగ్రహిస్తాడని తెలియాలి.

ఈ స్తోత్రంలో భగవానుని పలు అవతారాలు ఆయా నామాలద్వారా సూచింప బడ్డాయని మహేశ్వరతీర్థుల వ్యాఖ్యానంలో తెలుపబడింది. "విష్ణుః" అనే నామం ఉపేంద్రావతారాన్ని, సారంగనామం హంసావతారాన్ని, "రౌద్రాయ వపుషే" - అనే నామం నృసింహావతారాన్ని, "హర్యశ్వాయ" అనే నామం శ్రీరామావతారాన్ని "సప్తసప్తిః" అనే నామం కల్క్యవతారాన్ని, "త్వష్టా" అనే నామం పరశురామావ తారాన్ని సూచిస్తున్నవి - అని మహేశ్వరతీర్థులు వ్యాఖ్యానించారు. ఈ స్తుతిలో

"భగవతే హిరణ్యగర్భాయ నమః" అనే ద్వాదశాక్షరి మంత్రం ఆదిత్యహృదయ రహస్యమని కతక వ్యాఖ్యానంలో తెలుపబడింది. నిత్యం సంధ్యావందన కాలంలో అనుసంధింపబడే "ధ్యేయస్సదా సవితృమండలమధ్యవర్తీ నారాయణః, సరసిజాసనసన్నివిష్టః, కేయూరవాన్ మకరకుండలవాన్ కిరీటీ హారీ హిరణ్మయవపుః ధృతశంఖచక్రః" అనే పౌరాణికోక్తి ఆదిత్యమండలవర్తి అయన పరమాత్మస్వరూపాన్ని నిర్దేశిస్తున్నది. ఈ రూపం ఆదిత్యహృదయంలోని ఆయా నామాలద్వారా సూచితమైనది. "మండలీ" అనే నామం "సవితృమండలమధ్యవర్తీ, కేయూరవాన్, మకరకుండలవాన్, కిరీటీ హారీ" అనే విశేషణాలను, "అపాంపతిః" అనే నామం "నారాయణ" అనే విశేష్యాన్ని, "తప్తచామీకరాభాయ" "సువర్ణసదృశః", అనే నామాలు "హిరణ్మయవపుః" అనే విశేషణాన్ని సూచిస్తున్నవి. "గభస్తిమాన్" అనే విశేషణం ఈ మూర్తి లక్ష్మీవిశిష్టుడనే విషయాన్ని సూచిస్తున్నది. "గభస్తి" అంటే పరమాత్మతో ఎల్లప్పుడు కలసి ఉండి అంతటా వ్యాపించి ఉండే లక్ష్మీదేవి. "యథా సర్వగతో విష్ణుః తథైవేయం ద్విజోత్తమ!" అనే విష్ణుపురాణసూక్తి లక్ష్మీదేవి యొక్క సర్వగతత్వాన్ని తెల్పుతున్నది. "విద్యాసహాయ వంతంమామ్" అనే పంచమవేదమైన మహాభారతం లోని సూక్తి ఆదిత్యమండలవర్తి యొక్క లక్ష్మీసహితత్వాన్ని తెలియజేస్తున్నది.

ఈ ఆదిత్యహృదయస్తోత్రం లోని "సర్వదేవాత్మకో హ్యేష" అనే 7వ శ్లోకం నుండి "లోకసాక్షిణే" అని పూర్తి అవుతున్న 21వ శ్లోకంవరకు గల భాగంలో ఆదిత్యుని స్తుతించే 108 నామాలున్నవని మాహేశ్వరతీర్థవ్యాఖ్యలో తెలుపబడింది. గోవిందరాజీయ వ్యాఖ్యలో 10వ శ్లోకంనుండి 21వ శ్లోకంవరకు గల 12 శ్లోకాలలో ఆదిత్యహృదయస్తోత్రం ఇమిడి ఉన్నట్లు తెలుపబడింది. మొదటి తొమ్మిది శ్లోకాలు పూర్వపీఠిక. 21వ శ్లోకం నుండి చివరిశ్లోకం వరకు గల భాగంలో ఉత్తర పీఠిక, ఫలశ్రుతి ఇమిడి ఉన్నాయి. ద్వాదశాత్మకుడైన ఆదిత్యుని స్తుతి ద్వాదశ శ్లోకాత్మికగా ఉండడం ఒక విశేషం. ఆదిత్యహృదయరహస్యం "భగవతే హిరణ్యగర్భాయ నమః" అనే 12 అక్షరాలను కల ద్వాదశాక్షరి అంతేకాక, ద్వాదశ(12) అనే సంఖ్యలోని అంకెలను కలిపితే (1+2=3) మూడు అనే అంకె వస్తుంది. ఈ మూడు అనే అంకె త్రయీ అనబడే వేదానికి చిహ్నం. ఋగ్యజుస్సా మాలనే మూడు వేదాలచే తెలియబడే ఆదిత్యమండలాంతర్వర్తిని కీర్తించే ఈ స్తుతిలోని శ్లోకాల సంఖ్య మూడును లక్షించడం ఇంకొక విశేషం. తిలకమనే వ్యాఖ్యానంలో "రశ్మిమంతమ్" అని ఆరంభమవుతున్న 6వ శ్లోకం నుండి ఆదిత్య హృదయస్తుతి



మొదలై 24వ శ్లోకంతో ముగుస్తున్నది అని తెలుపబడింది. అంటే-19 శ్లోకాలలో ఈ స్తుతి నిక్షిప్తమై ఉన్నది. ఈ స్తుతిలో 125 నామాలు ఉన్నట్లు ఆ వ్యాఖ్యలో గణింప బడ్డాయి. కతక వ్యాఖ్యలోకూడా ఈవిధంగానే లెక్కింపబడినట్లు తిలకవ్యాఖ్యలో తెలుపబడింది. ఈ వ్యాఖ్యానాలు అన్నిటిలో ఈ ఆదిత్య హృదయస్తోత్రం భగవత్పరంగానే వ్యాఖ్యా నింపబడడం గమనార్హం. ఒకే నామానికి పలువిధాలైన అర్థాలను వ్యాఖ్యాతలు ఆ పదాలకు మూలమైన ధాతువుల అర్థాలను బట్టి, ముందువెనుకలు చేరే ఉపసర్గ ప్రత్యయాదులవల్ల స్ఫురించే అర్థవిశేషాలను బట్టి వివరిస్తారు.

ఆదిత్య హృదయానికి ఎన్నో వివరణలు, వ్యాఖ్యానాలు పలుభాషలలో ఇంతకుముందే వెలువడ్డాయి. వెలువడుతూ ఉన్నాయి. ఇప్పుడు మళ్ళీ ఇంకొక మారు ఈ మంత్రరూపమైన స్తుతి వివరింపబడుతున్నవి. కొన్ని నామాల వివరణలో దివ్యసూరి సూక్తుల భావాల సామ్యాలు సూచింపబడ్డాయి. బహుశ ఈ ప్రక్రియ అపూర్వమని భావిస్తాను. ఆదిత్య హృదయంలోని కొన్ని నామాలు శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్రంలో కూడా కన్పిస్తాయి. పరాశరభట్టర్ ఆ నామాలకు తెల్పిన వివరణలు ప్రస్తుత వ్యాఖ్యానంలో ప్రస్తావింపబడ్డాయి. ఆదిత్యమండలవర్తి సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే కదా! ఈ వ్యాఖ్యాన రచనలో నన్ను సదా ప్రోత్సహించి ఆశీర్వదించి మార్గదర్శనం చేసిన పితృపాదులు న్యాయవేదాన్తవిద్వాన్, ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యస్వామివారి సన్నిధిలో కృతజ్ఞతాపూర్వకంగా ప్రణమిల్లు తున్నాను. ఈ గ్రంథముద్రణకు కావలసిన ద్రవ్యాన్ని శ్రద్ధాభక్తులతో సమర్పించిన శ్రీమతి జానకమ్మ, శ్రీమాన్ జంపన సత్యనారాయణరాజు దంపతులను అభినందిస్తు న్నాను. శ్రీమాన్ సత్యనారాయణరాజు గారు ఉన్నతపాఠశాలలో నాకు సహాధ్యాయి. మాకుటుంబంపై ఆదరాభిమానాలను కలవారు. శ్రీమతి జానకమ్మ గారు మా పితృపాదులను ఆశ్రయించారు. శ్రీమతి జానకమ్మ తండ్రిగారు శ్రీమాన్ అల్లూరు శ్రీరామరాజుగారు మా పితామహులను ఆశ్రయించారు. ఈ విధంగా ఈదంపతుల కుటుంబాలు రెండూ మాతో చాలా సన్నిహితం అయిన సంబంధాన్ని కల్గినవి. శ్రీమతి జానకమ్మ, శ్రీసత్యనారాయణరాజు దంపతులు ఆస్తిక్యాన్ని, సంప్ర దాయశ్రద్ధను కలిగినవారు. వీరి కుటుంబానికి శ్రీనివాసప్రభువు సకలశ్రేయస్సులను కలిగించి, వీరి సంప్రదాయశ్రద్ధను మరింత పెంపొందించాలని కోరుకొంటున్నాను. ఈ గ్రంథముద్రణలో నాకు సహాయపడిన శ్రీచంద్రశేఖర్‌గారికి, శ్రీహర్షవర్ధన్ గారికి

కృతజ్ఞతలు. వ్యాఖ్యానంలోని అజ్ఞాన ప్రమాద కృతాలైన దోషాలను సహృదయు లైన పాఠకులు క్షమిస్తారని నమ్ముతున్నాను.

ఆదిత్యహృదయవ్యాఖ్యా నామ్నా హృదయరంజనీ ।
శింగరార్య కృతా భూయాత్ సారాసారవిదాం ముదే ॥

ఇట్లు
భాగవత విధేయుడు
ఈ.ఏ. శింగరాచార్యులు

తిరుపతి
20-4-2013

卐卐卐卐卐



శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

# ఆదిత్యహృదయం - హృదయరంజనీవ్యాఖ్యానం

( శ్రీరామాయణం యుద్ధకాండలోని 107వ సర్గ )

卐卐卐卐卐

ఆదిత్యహృదయం ప్రోక్త మగస్త్యేన మహర్షిణా ।
స్తోత్రం వ్యాఖ్యాయతే పుణ్యం శింగరార్యేణ భక్తితః ॥

1) తతో యుద్ధపరిశ్రాంతం సమరే చింతయా స్థితమ్ ।
రావణం చాగ్రతో దృష్ట్వా యుద్ధాయ సముపస్థితమ్ ॥

2) దైవతైశ్చ సమాగమ్య ద్రష్టుమభ్యాగతో రణమ్ ।
ఉపాగమ్యాబ్రవీత్ రామ మగస్త్యో భగవాన్ ఋషిః ॥

అపుడు యుద్ధంలో చాలా అలసినవాడు, యుద్ధరంగంనుండి కొంతసేపు వెలుపలకు పోయినా, తిరిగి యుద్ధం చేయడంకోసం తన ముందుకు వచ్చిన వాడైన రావణుని చూచి, శ్రీరాముడు తన పరత్వాన్ని ప్రదర్శించకుండా ఏవిధంగా ఇతనిని జయించాలి? అని ఆలోచించాడు. ఆ విధంగా రావణుని వధను గూర్చి చింతతో ఉండే శ్రీరామునితో, ఆ యుద్ధాన్ని చూడాలని దేవతలతో పాటు అక్కడకు వచ్చిన భగవానుడైన అగస్త్య మహర్షి, ఈ విధంగా అన్నాడు.

3) రామ! రామ! మహాబాహో! శృణు గుహ్యం సనాతనమ్ ।
యేన సర్వానరీన్ వత్స! సమరే విజయిష్యసి ॥

4) ఆదిత్యహృదయం పుణ్యం సర్వశత్రువినాశనమ్ ।
జయావహం జపేన్నిత్య మక్షయ్యం పరమం శివమ్ ॥

5) సర్వమంగళమాంగల్యం సర్వపాపప్రణాశనమ్ ।
చింతాశోకప్రశమన మాయుర్వర్ధనముత్తమమ్ ॥

శ్రీరామా! శ్రీరామా! మహాబాహూ! ఈ ఆదిత్యహృదయాన్ని శ్రద్ధగా ఆలకించు. ఇది ఆదిత్యుడైన సూర్యుని హృదయానికి (ఆదిత్యమండల వర్తి అయిన భగవానునకు) ఆనందాన్ని కల్గిస్తుంది. పుణ్యమైనది, శత్రువులను అందఱిని నశింపజేస్తుంది. జయాన్ని కల్గిస్తుంది. క్షయం లేనిది. మిక్కిలి శుభకరమైనది.

ఈ ఆదిత్యహృదయమనే మంత్రాన్ని ఎల్లప్పుడు జపించాలి. ఇది అన్ని మంగళాలకు మంగళమైనది. అన్ని పాపాలను హరిస్తుంది. చింతను, శోకాన్ని నశింపజేస్తుంది. ఆయుస్సును వృద్ధి చేస్తుంది. ఉత్తమమైనది.

వ్యాఖ్యానం : అగస్త్యుడు శ్రీరాముని "రామ! రామ!" అని రెండు మార్లు సంబోధించడానికి కారణం, శ్రీరాముడు రావణుని జయించే ఉపాయాన్నిగూర్చిన చింతలో ఉన్నందున, అతనిపట్ల తనకు ఉండే గొప్ప ఆదరంవల్ల, అతడు రావణ సంహారాన్ని వెంటనే చేయాలనే త్వరవల్ల ఆ విధంగా రెండు మార్లు సంబోధించాడు. "మహా బాహో!" అని అంటూ శ్రీరాముడు గొప్ప బాహువులను కలవాడని అనడంద్వారా ఇంతకుముందు అతడు ప్రదర్శించిన గొప్ప పరాక్రమాన్ని మహర్షి ప్రకటించాడు.

(సనాతనమ్) - వేదంవలె ఎప్పటికి నశించకుండా, నిత్యమై ఉంటుంది.

(గుహ్యమ్) - ఇది చాలా రహస్యమైనది.

(ఆదిత్యహృదయమ్) - ఆదిత్యుని మనస్సుకు ఆనందాన్ని కల్గిస్తుంది.

(ఆదిత్యహృదయమ్) - "య ఏషో-ంతరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే" అనే శ్రుతిలోని ఆదిత్యశబ్దానికి ఆదిత్యమండలమని అర్థం. అదే రీతిలో ఆదిత్య శబ్దంద్వారా ఆదిత్యమండలం తెలుపబడుతున్నది. దాని హృదయం అంటే - ఆ మండలంలోపల ఉండే పురుషుడని అర్థం. లేక, ఆదిత్యుడంటే సూర్యుడు. అతని హృదయం (హృత్ + అయమ్) - అంటే హృద్గతమైన పరమాత్మ. "ఆదిత్యే తిష్ఠన్ య ఆదిత్య మంతరో యమయతి" అని శ్రుతి ఈ విషయాన్ని తెల్పుతున్నది. అతని వైభవాన్ని ప్రతిపాదించే స్తోత్రమని అర్థం - అని తనిశ్లోకి వ్యాఖ్యాన వివరణం.

(పుణ్యమ్) - తనను అనుసంధించేవారి పుణ్యాన్ని వృద్ధిచేస్తుంది.

(సర్వశత్రువినాశనమ్) - పఠించేవారి సమస్తశత్రువులను నశింపజేస్తుంది.

(జయావహమ్) - "సర్వశత్రువినాశనమైనా, తుల్యన్యాయంద్వారా యుద్ధంలో ఎవరికీ జయం కలుగక పోవచ్చుకదా!" - అని అంటే, ఆ విధంగా కాదు; జపించే వారికి తప్పక జయాన్ని కల్గిస్తుంది.

(అక్షయ్యమ్) - వారికి ఏనాటికీ నశించని ఫలాన్ని ఇస్తుంది.



(పరమం శివమ్) - పరమ పవిత్రమైనది.

(సర్వమంగళమాంగల్యమ్) - "మంగళానాం చ మంగళమ్". (అన్ని మంగళాలకు మంగళం) అనే రీతిలో అన్ని మంగళాలకు మంగళమైనది. అన్ని శ్రేయస్సులకు సాధనమైనదని, ఇష్టప్రాప్తి సాధనం అని తాత్పర్యం.

(సర్వపాపప్రణాశనమ్) - ఇంతకు ముందు చేసిన పాపాలను అన్నిటిని నశింపజేస్తుంది. అనిష్ట నివారకమని తాత్పర్యం.

(చింతాశోకప్రశమనమ్) - శారీరకవ్యాధులను, మానసికవ్యాధులను తీరుస్తుంది.

(ఆయుర్వర్ధనమ్) - అధికమైన ఆయుస్సును కల్గిస్తుంది.

(ఉత్తమమ్) - జపించదగినవానిలో ఉత్తమమైనది. అందువల్ల ఈ ఆదిత్య హృదయమనే స్తుతిని నీవు జపించాలని తాత్పర్యం.

6) రశ్మిమంతం సముద్యంతం దేవాసురనమస్కృతమ్ ।
పూజయస్వ వివస్వంతం భాస్కరం భువనేశ్వరమ్ ॥

కిరణాలను కలవాడు, ఉదయించేవాడు, దేవతలచే, రాక్షసులచే నమస్కరింపబడేవాడు, మిగిలిన తేజఃపదార్థాలను అన్నిటిని తేజోహీనాలుగా చేసేవాడు, భువనేశ్వరుడైన భాస్కరుని సేవించు.

వ్యాఖ్యానం : ఈ శ్లోకంలో స్తుతింపవలసిన ఆదిత్యుని స్వరూపాన్ని అగస్త్యమహర్షి తెల్పుతున్నారు.

(రశ్మిమంతమ్) - బంగారు రంగును కల్గినందున గొప్పగా పొగడబడే కిరణాలను కలవానిని.

(రశ్మిమంతమ్) - రశ్మిశబ్దానికి కిరణమని, పగ్గాలని అర్థం. "కిరణ ప్రగ్రహౌ రశ్మీ" అని అమరం. సూర్యుని పక్షంలో వేయి కిరణాలను కలవాడు, ఏడు విధాలైన సర్పాలను పగ్గాలుగా కలవాడని అర్థం. అంతటా వ్యాపించిన జ్ఞానాన్ని కలవాడని భగవానుని పరంగా అర్థం.

(రశ్మిమంతమ్) - రశిశబ్దం ఇంద్రియవాచకం. పంచేంద్రియాలద్వారా అనేక జ్ఞానాలనే కిరణాలను కలవాడు - అని తిలకవ్యాఖ్యానం.

(రశ్మిమంతమ్) - ఇక్కడ రశ్మిశబ్దం నిత్యసూరులను తెల్పుతుంది. అందువల్ల

"రశ్మిమంతమ్" అనే పదానికి నిత్యసూరులను కలవాడు, నిత్యసూరులమధ్యలో ప్రకాశించేవాడని అర్థం. "రశ్మిగ్ం రశ్మీనాం మధ్యే తపంతమ్" అని సువర్ణసూక్తిలో తెలుపబడింది - అని తనిశ్లోకి వివరణం.

(సముద్యంతమ్) - అర్ధోదయాన్ని - సగం ఉదయించిన స్థితిని - పొందడం కాకుండా, పూర్ణమైన ఉదయంతో చక్కగా ఉదయాన్ని పొందినవానిని - అని అర్థం. ఈ విశేషణంద్వారా ఉదయించే కాలంలోని సూర్యుని ఆరాధించాలని తెలుప బడింది. వాస్తవానికి ఈ ఆదిత్యహృదయాన్ని అగస్త్యుడు ఉపదేశించిన సమయం ఉదయకాలం కాదు. అగస్త్యుడు మధ్యాహ్న సమయంలో వచ్చాడు. "అహం తు వధ మిచ్ఛామి శీఘ్రమస్య దురాత్మనః, యావదస్తం న యాత్యేష కృత కర్మా దివాకరః" (ఈ సూర్యుడు తన కృత్యాన్ని ఋజువుగా పూర్తి చేసి అస్తమించ డానికి ముందే ఈ దురాత్ముని వధను నీవు చేయాలని నేను కోరు తున్నాను) అని లక్ష్మణుడన్నాడు కదా! - అని గోవిందరాజీయవ్యాఖ్యాన వివరణం.

(సముద్యంతమ్) - నిత్యోదితదశను కలవాడని అర్థం. లేక, "యః పూర్వ్యాయ వేధసే నవీయసే" అని చెప్పబడినట్లుగా ఎల్లప్పుడు అత్యంతం నూతనంగా ఉదయించినవానివలె ఉన్నవాడని అర్థం - అని తనిశ్లోకి వివరణం.

(సముద్యంతమ్) - లోకాలను ఆయా కర్మలలో ప్రవర్తింపజేసేవానిని - అని తిలకవ్యాఖ్యానం.

(దేవాసురనమస్కృతమ్) - ఇక్కడ దేవాసురశబ్దాలు దేవతల, అసురుల ప్రకృతిని తెల్పుతున్నవి. దైవీప్రకృతిని, రాక్షసప్రకృతిని కలవారిచే నమస్కరింపబడే వాడని అర్థం - అని తనిశ్లోకి వివరణం. "దేవానాం దానవానాం చ సామాన్య మధిదైవతమ్" అని ఋగ్వేదఖిలమైన జితంతాస్తోత్రం తెల్పుతున్నది.

(వివస్వంతమ్) - "వివస్తే-ఆచ్ఛాదయతి" తనకంటే మిగిలిన తేజఃపదార్థాలను అన్నిటిని తన కాంతితో మఱుగుపరచేవానిని - అని అర్థం. పన్నెండుమంది ఆదిత్యుల నామాలలో "వివస్వాన్" అనే పేరు ఒకటి. "అథ యదతః పరో దివో జ్యోతిర్దీప్యతే, విశ్వతః పృష్ఠేషు సర్వతః పృష్ఠేషు అనుత్తమేషూత్తమేషు లోకేషు" అని అంటూ శ్రుతి, పరమాత్మ అన్ని తేజస్సులను మఱుగుపరచి గొప్పగా ప్రకాశించే జ్యోతి అని అన్నది.

(వివస్వంతమ్) - విశేషమైన సంపదను కలవానిని - అని తిలక వ్యాఖ్యానం.



"వసునిధి" అని అర్థం. సకలవ్యవహారాలకు అధిష్ఠాన (ఆధార) మైనందున, తన ఉదయంతో సకల వ్యవహారాలను నిర్వహిస్తున్నందున సూర్యుడు "వివస్వాన్" - విశేషమైన వసువును- సంపదను - కలవాడవుతాడు.

(భాస్కరమ్) కాంతిని కల్గించేవానిని. సూర్యచంద్రాగ్నులు మొదలైన తేజో వస్తువులకు తేజస్సును కలిగించేవాడు.

(భువనేశ్వరమ్) - వర్షం ద్వారా, ఎండద్వారా సమస్తలోకాలను నియంత్రించే వానిని

(భువనేశ్వరమ్) - మూలంనుండి బ్రహ్మరంధ్రంవరకు గల యోగాధార స్థానాలను అధిష్ఠించి ఉండేవాడని, భూమిమొదలైన సమస్తలోకాలను ప్రకాశింప జేసేవాడని - అని తిలకవ్యాఖ్యానం. భువన శబ్దానికి గగనమనే అర్థం కూడా ఉన్నందున ఆకాశానికి అధిపతి - అని సూర్యుని పక్షంలో, పరమపదనాథుడని పరమాత్మ పక్షంలో అర్థాలను చెప్పవచ్చు.

(పూజయస్వ) - ఈ ఆదిత్యహృదయమనే స్తోత్రాన్ని అనుసంధించడం ద్వారా పూజించు. సూర్యుని మనస్సుకు ఆనందాన్ని కల్గించు - అని తాత్పర్యం.

ఈ స్తోత్రానికి విద్యామండలాధీశ్వరుడైన అగస్త్యుడు ఋషి. ఛందస్సు అనుష్టుప్. ఆదిత్యహృదయ భూతుడైన భగవానుడు దేవత. సమస్తవిఘ్నాలు తీరడంకోసం, బ్రహ్మవిద్య సిద్ధించడంకోసం, అంతట జయం సిద్ధించడంకోసం ఈ స్తుతి వినియోగింపబడు తున్నది - అని తిలకవ్యాఖ్యానంలో తెలుపబడింది.

## మహేశ్వరతీర్థవ్యాఖ్యానాదివిశేషాలు

(రశ్మిమంతమ్) - రశ్మిశబ్దం అంతరంగభక్తవాచకం. వారి మధ్యలో భాసించే వాడని అర్థం.

(వివస్వంతమ్) - నిరతిశయమైన దీప్తిని కలవాడని - అర్థం. "అథ యదతః పరో దివో జ్యోతిః దీప్యతే విశ్వతః పృష్ఠేషు సర్వతః పృష్ఠేష్వనుత్తమేషూత్తమేషు లోకే" అనే శ్రుతివాక్యం స్మరణీయం.

(భాస్కరమ్) - సూర్యుడు, చంద్రుడు, అగ్ని మొదలైనవారికికూడా కాంతిని కల్గించేవాడు - అని అర్థం. "న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం నేమా విద్యుతో భాంతి కుతో-య మగ్నిః, తమేవ భాంత మనుభాతి సర్వం తస్య

భాసా సర్వమిదం విభాతి" (సూర్యుడు ప్రకాశించడం లేదు, చంద్రుడు, తారకలు ప్రకాశించడం లేదు, ఈ విద్యుత్తులు భాసించడంలేదు. ఇక ఈ అగ్నినిగూర్చి చెప్పవలసినది ఏమున్నది? ప్రకాశించే ఆ పరమాత్మను అనుసరించే అంతా ప్రకాశిస్తున్నది. అతని ప్రకాశంతోనే ఈ సమస్తం ప్రకాశిస్తున్నది) అనే శ్రుతివాక్యం స్మరణీయం.

(భువనేశ్వరమ్) - భువనశబ్దం సమస్తబ్రహ్మాండాలను తెల్పుతుంది. వాటికి అన్నిటికి ఈశ్వరుడు - శాసించేవాడని అర్థం.

7) సర్వదేవాత్మకో హ్యేషః తేజస్వీ రశ్మిభావనః ।
ఏష దేవాసురగణాన్ లోకాన్ పాతి గభస్తిభిః ॥

ఈ సూర్యుడు సమస్తదేవతలకు ఆత్మయై, స్వరూపమై ఉన్నాడు. గొప్ప తేజస్సును కలవాడు. తన కిరణాలతో లోకాలను రక్షిస్తున్నాడు. దేవాసుర సమూహాన్ని తన కిరణాలతో కాపాడుతున్నాడు.

వ్యాఖ్యానం : దేవతలు పలువురున్నారు కదా! ఈ ఆదిత్యుని గొప్ప తనం ఏమి? అని అంటే - ఈ ఆదిత్యుడు -

(సర్వదేవాత్మకః) - సమస్తదేవతలకు ఆత్మ. "సూర్య ఆత్మా జగతః తస్థుషశ్చ" (ఈ సూర్యుడు జంగమస్థావరాలకు ఆత్మ) అని శ్రుతి ఈ అర్థాన్ని తెల్పింది.

(రశ్మిభావనః) - తన కిరణాలతో లోకాలను అనుభావనను - అంటే - రక్షణను చేసేవాడని అర్థం.

(దేవాసురగణాన్ లోకాన్ గభస్తిభిః పాతి) - ఈ ఆదిత్యుడే సమస్తలోకాలను రక్షిస్తున్నాడు. "యాభిరాదిత్య స్తపతి రశ్మిభి స్తాభిః పర్జన్యో వర్షతి" (ఏ కిరణాలతో సూర్యుడు తపింపజేస్తున్నాడో, ఆ కిరణాలకారణంగానే పర్జన్యుడు వర్షిస్తున్నాడు) అని వేదం తల్పుతున్నది. "ఆదిత్యాజ్జాయతే వృష్టిః, వృష్టేరన్నం తత ప్రజాః" అనికదా చెప్పబడుతున్నది.

(గభస్తిభిః) తేజోలేశాలచేత - అని అర్థం. భగవద్గీతలో "యద్యద్విభూతిమత్ సత్వం శ్రీమదూర్జితమేవ వా, తత్తదేవావగచ్ఛత్వం మమ తేజో-ంశసంభవమ్" అని గీతలో లోకంలోని ఉత్తమవస్తువులన్నీ పరమాత్మ అంశచే సంభవించినవి తెలుప బడింది కదా - అని తనిశ్లోకి వ్యాఖ్యానంలోని వివరణం.



(గభస్తిభిః) - "గాం జ్ఞేయవర్గం బభస్తి దీపయతి ఇతి గభస్తిః" - తెలియదగిన వస్తువులను ప్రకాశింపజేస్తుంది. కనుక సూర్యకిరణానికి గభస్తి - అని పేరు. సూర్యుడు వాటితో వస్తు ప్రకాశాన్ని కల్గించి లోకాన్ని రక్షిస్తాడు. కిరణస్థానీయులైన సదాచార్యుల ద్వారా లోకాన్ని రక్షించేవాడనే అర్థాన్ని భగవానుని పరంగా చెప్పవచ్చు. "గభస్తి" శబ్దాన్ని భట్టర్ సుదర్శనచక్ర పరంగా వ్యాఖ్యానించారు. సుదర్శనాన్ని అన్ని భగవదా యుధాలకు ఉపలక్షణంగా గ్రహించి, దివ్యాయుధాలతో లోకాలను రక్షించేవాడనే అర్థాన్ని చెప్పవచ్చు.

## మహేశ్వరతీర్థవ్యాఖ్యానాదివిశేషాలు

(సర్వదేవాత్మకః) - సమస్తదేవతలను శరీరంగా కలవాడని దీని అర్థం. "యస్సర్వేషు దేవేషు తిష్ఠన్" (ఏ పరమాత్మ దేవతలందరిలో ఉన్నవాడై) అనే వేదవాక్యం దీనిని తెల్పుతున్నది.

(తేజస్వీ) - తేజస్సు అంటే - ఇతరులను అవలీలగా నిరసించగల్గిన సామర్థ్యం. దానిని కలవాడని అర్థం.

(రశ్మిభావనః) - రశ్మిశబ్దం ఇక్కడ నిత్యసూరులను, ముక్తులను తెల్పుతుంది. వారిని భావించడం అంటే - వారి సత్తానిర్వాహాన్ని చేయడమే. నిత్యుల, ముక్తుల సత్తాస్థితిప్రవృత్తులన్నీ భగవత్సంకల్పాధీనాలుకదా! ("నిత్యం ప్రియా స్తవ తు కేచన తే హి నిత్యాః" - కొంతమంది నీకు నిత్యం ఇష్టమైనవారు. వారేకదా నిత్యులు - అనే కూరేశుల సూక్తి స్మరణీయం.)

8) ఏష బ్రహ్మా చ విష్ణుశ్చ శివః స్కందః ప్రజాపతిః ।
మహేంద్రో ధనదః కాలో యమః సోమో హ్యపాం పతిః ॥

ఇతడే బ్రహ్మ, విష్ణువు, శివుడు, స్కందుడు, ప్రజాపతి, మహేంద్రుడు, కుబేరుడు, మృత్యువు, యముడు, సోముడు, వరుణుడుకూడా

వ్యాఖ్యానం: "ఏష బ్రహ్మా" అని ఆరంభించి ఇందులో సూర్యుడు సర్వదేవాత్మకుడనే విషయం వివరింపబడుతున్నది. ఇతడే బ్రహ్మాదిసమస్తదేవతలను శరీరంగా కలవాడని అర్థం. ఈ ప్రయోగాలన్నీ శరీరశరీరిభావప్రయుక్త సామానాధికరణ్య ప్రయోగాలు.

(విష్ణుః) - "ఏవం వర్షన్ వేవేష్టితి" - (అన్ని శుభాలను వర్షిస్తూ ఎవరికీ ఏ ఆపద కలుగకుండా అంటూ వ్యాపించి ఉంటాడు) అనేది ఈ నామానికి భట్టర్ వివరణం.

(ప్రజాపతిః) - ప్రజాపతులు పలువురు అయినా ఇక్కడ జాత్యేకవచనం

ప్రయోగింపబడింది. దీనిద్వారా తొమ్మిదిమంది ప్రజాపతులు తెలుపబడ్డారు. వీరంతా భగవానునకు శరీరభూతులు - అని అర్థం.

(ప్రజాపతిః)- "బద్ధముక్తేభ్యః ప్రకృష్టతయా జాయంతే భవంతీతి ప్రజాః సూరయః - తేషాం పతిః స్వామీ" - అని అంటూ నిత్యసూరినాథత్వాన్ని ఈ నామం తెల్పుతున్నదని భట్టర్ అనుగ్రహించిన వివరణం స్మరణీయం. "మునివర్క్కురియ అప్పన్" (తిరువాయ్-8-6-11) అనే దివ్యసూరి సూక్తి భావ్యం.

(మహేంద్రః) - "సర్వతోముఖం ప్రసృతత్వాత్ పూజ్యపరమైశ్వర్యః" - (పలు విధాలుగా లోకంలో వ్యాపించిన పవిత్రమైన ఐశ్వర్యాన్ని కలవాడు) అనే భట్టర్ ఈ నామాన్ని వివరించారు. "పాఙ్గోదమ్ శూఴ్న్ద పువనియుమ్ విణ్ణులకుమ్ అఙ్గాదుమ్ శోఱామే ఆళ్కిన్ద ఎమ్బెరుమాన్" అని గోదాదేవి సూక్తి.

(శివః) - శుభావహశ్చ - శుభాన్ని కల్గించేవాడు. "శాలత్తుయిర్క్కెల్లామ్ అరుళ్ శెయ్యుమ్" అని నమ్మాళ్వార్ సూక్తి.

(శివః) - "సర్వబుభుక్షుముముక్షు శివంకరత్వాత్ శివః" (ముముక్షువులకు, ఇహలోక ప్రాప్తిని కోరేవారికి సమానంగా ఫలాలను ఇచ్చేవాడు) అనే భట్టర్ వివరణం స్మరణీయం. "అరుళొడు పెరునిల మళిక్కుమ్ నారణన్" (పెరియ తిరు-1-1-9) అని తిరుమంగై మన్నన్ సూక్తి.

(శివః) - శివుని శరీరంగా కలవాడు. నమ్మాళ్వార్లు కూడా "మునియే! నాన్ముకనే! ముక్కణ్ణప్పా" అని అన్నారు. "స బ్రహ్మ స శివః స్సేంద్రః" అనే శ్రుతివాక్యం స్మరణీయం.

(స్కందః) - సంసారదుఃఖాన్ని నశింపజేసేవాడని అర్థం. "మహేంద్రో వరుణః" అనే పాఠం ఉన్నది. అపుడు, వరుణపదంచేత నిర్దేశింపబడే పరమాత్మ - అని అర్థం. "వరుణో వారుణో వృక్షః" అని సహస్రనామంలో వరుణ నామంతో నిర్దేశింపబడ్డాడు కదా - అని తనిశ్లోకి వివరణం.

(స్కందః) - శత్రువులను శోషింపజేసేవాడు - అని కాని, షణ్ముఖుని శరీరంగా కలవాడని కాని అర్థం. రాక్షసులను శోషింపజేసేవాడనే అర్థాన్ని భట్టర్ విష్ణుసహస్ర నామ స్తోత్రంలోని ఈ నామానికి తెలిపారు.

సహస్రనామభాష్యంలో కూర్మావతారపరంగా కూడా ఈ నామం వ్యాఖ్యా



నింపబడింది. "సేనానీ మహం స్కందః" అని గీతాసూక్తి.

(కాలః) - ఈ పదం మృత్యువును తెల్పుతుంది. ఎందుకు? అంటే, యముడు ప్రత్యేకంగా నిర్దేశింపబడ్డాడుకదా. ("యమస్సోమః" - అని అంటూ)

(కాలః) - "ఏవం భూతైః గుణైరాత్మని చరాచరసంకలనాత్" (అనేక సద్గుణాలతో చరాచరాలను అన్నిటినీ ఆకర్షించి తనలో కలుపుకొనేవాడు) అనే భట్టర్ వివరణం స్మరణీయం.

"కాల" మనే విష్ణుసహస్రనామస్తోత్రంలోని నామంకూడా ఇదే అర్థాన్ని ఇస్తున్నదని భట్టర్ వివరణం. "అనాదిర్భగవాన్ కాలః" అని విష్ణుపురాణం కాలం భగవదాత్మకమని పల్కింది.

(కాలః) - "కాలయతి ప్రేరయతి ఇతి కాలః కల-ప్రేరణే" - జీవులను ప్రేరేపిస్తున్నాడు. కనుక కాలశబ్దవాచ్యుడు. సూర్యుడు కాలస్వరూపుడు - దివారాత్రి విభాగాన్ని కల్గించడంద్వారా

(యమః) - "అఖిలమ్ అకంటకానుకూలం యచ్ఛతీతి యమః" - "యః పృథివీ మంతరో యమయతి, య ఆత్మాన మంతరో యమయతి ఇతి" ఇత్యాదిగా సకల ప్రపంచాన్ని నిష్కంటకంగా నిగ్రహిస్తాడు కనుక యముడు - అనే భట్టర్ వివరణం గ్రాహ్యం. "పాఙ్గోదమ్ శూఴ్న్ద' ఇత్యాది గోదాసూక్తి స్మరణీయం.

(యమః) - "తత్తత్ ఫలనియామకాన్ యమాదీనపి యచ్ఛతీతి యమః. ఏవం రజస్తమసోః నియమనమ్" - (ఆయా ఫలాలను ఇచ్చేవారుగా ప్రసిద్ధులైన యమాది దేవతలను నియమించేవాడు, దేవతలలోనేకాక మానవులలోని రజస్తమోగుణాలను నియమించేవాడు) అని భట్టర్ వివరణం. "మార్క్కణ్డేయనవనై నక్కపిరానుమ్ అన్ఱుయ్యక్కొణ్డదు నారాయణనరుళే" (తిరువాయ్ 4-10-8) అని ఆళ్వార్ల సూక్తి.

(సోమః) - "స్వస్మై, స్వానుభవితృభ్యశ్చ అమృతాయమానః - సోమః" (తనకు, తనను అనుభవించువారికికూడా అమృతం వలె భోగ్యుడు) అనే భట్టర్ తెల్పిన వివరణం ప్రకృతంలో కూడా అనుసంధేయం. "ఎప్పొఴుదుమ్ నాళ్ తిఙ్గళ్ ఆణ్డాఴి యూఴితొఱుమ్ అప్పొఴుదైక్కప్పొఴుదు ఎన్నారావముదమే" అని నమ్మాళ్వార్ల సూక్తి.

## మహేశ్వరతీర్థవ్యాఖ్యానాదివిశేషాలు

(బ్రహ్మ) - చతుర్ముఖుని శరీరంగా కలవాడు.

(విష్ణుః) - ఉపేంద్రావతారాన్ని ఎత్తినవాడు.

(ప్రజాపతిః) - "ప్రజాపతిశ్చరతి గర్భే అంతః" అనే శ్రుతిలో నిర్దేశింపబడిన ప్రజాపతిశబ్దంచే తెలియబడేవాడు. సకలజీవవర్గానికి పాలకుడు.

(మహేంద్రః) - నిరవధికస్వరూపాన్ని, నిరవధికమైన ఐశ్వర్యాన్ని కలవాడు. "ఇంద్రం విచిక్యుః పరమే వ్యోమన్. ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే" అనే శ్రుతివచనాలలో పరమాత్మ ఇంద్రశబ్దంతో నిర్దేశింపబడ్డాడు.

(ధనదః) - "అన్నాదో వసుదానః" అనే శ్రుత్యర్థాన్ని ఇక్కడ స్మరించాలి. ప్రసిద్ధమైన సకలఫలాలను ఇచ్చేవాడని దీని అర్థం. ధనం అంటే చైతన్యం. దానిని అందరిలోనూ అనుగ్రహించడం కోసం స్థాపించేవాడని కూడా అర్థం.

(కాలః) కాలస్వరూపుడు, జగత్సంహారకుడని అర్థం. "కాలాయ మహాగ్రాసాయ నమః" అనే శ్రుతి, "అత్తా చరాచరగ్రహణాత్" అనే బ్రహ్మసూత్రం, "అనాదిర్భగవాన్ కాలః" అనే పరాశరస్మృతివచనం ఈ అర్థాన్ని తెల్పుతున్నవి.

(యమః) - జీవులలో నిలచియుండి, వారిని నియమించి శిక్షించేవాడు. "యమో వైవస్వతో రాజా యస్తవైష హృది స్థితః" అనే స్మృతివచనం దీనిని తెల్పుతున్నది.

(సోమః) - అమృతాన్ని ప్రసవించేవాడని అర్థం. "సోమః పవతే జనితా మతీనాం జనితా దివమ్" అని అంటూ వేదంలో సకలకారణంగా చెప్పబడిన సోమశబ్దంచేత నిర్దేశింపబడేవాడని కూడా అర్థం. చంద్రుని శరీరంగా కలవాడని అర్థం.

(అపాం పతిః) - "ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః, తా యదస్యాయనం పూర్వం తేన నారాయణః స్మృతః" (జలం "నారాః" అనే శబ్దంచేత చెప్పబడుతున్నది. ఆ జలం సృష్టికి ముందు ఈ పరమాత్మకు ఆధారం కనుక, ఇతడు నారాయణుడు అనబడుతున్నాడు) అనే సూక్తివల్ల, ఈ పదం నారాయణుని తెల్పుతుంది. "ఆపః" - అంటే అంతఃకరణం. దానికి ప్రభువు పరమాత్మ - అని అర్థం. జలాధిపతి వరుణుడు గనుక, ఈ నామం వరుణునకు అంతర్యామియైన భగవానుని తెల్పుతున్నదని చెప్పవచ్చు. "వరుణో వారుణః" అని సహస్రనామ స్తోత్ర సూక్తి.



9) పితరో వసవః సాధ్యా హ్యశ్వినో మరుతో మనుః ।
వాయుర్వహ్నిః ప్రజాప్రాణా ఋతుకర్తా ప్రభాకరః ॥

ఇతడే పితృదేవతలను, అష్టవసువులను, సాధ్యులనే దేవతలను, ఇద్దఱు అశ్వినీ దేవతలను, ఆవహుడు మొదలైన మరుత్తులను, మనువులను, వాయువును, అగ్నిని శరీరంగా కలవాడు. ప్రజలకు ప్రాణస్థానీయుడు. వసంతాది ఋతువులకను కల్గించే ప్రభాకరుడు.

వ్యాఖ్యానం : (మరుతః) - ఆవహ, ప్రవహ, సంవహ, ఉద్వహ, వివహ, పరివహ, పరావహులనే ఏడుమంది వాయుదేవతలకు అంతర్యామి ఇతడే.

(మనుః) - సర్వజ్ఞుడని అర్థం. ఈ పదం "మను - అవబోధనే" అనే జ్ఞానార్థక ధాతువునుండి పుట్టినది - అని తనిశ్లోకి వివరణం. "మునియే! నాన్ముకనే!" అని నమ్మాళ్వార్ల సూక్తి.

"తదైక్షత బహుస్యాం ప్రజాయేయ" (నేను బహుత్వాన్ని పొంది, అనేక రూపాలుగా జన్మిస్తాను - అని పరబ్రహ్మం సంకల్పించింది) ఇత్యాది ప్రమాణాలను చూపుతూ భగవానుని జగత్సృష్టి సంకల్పరూపమననము ఈ నామం తెల్పుతున్నదని భట్టర్ వివరించారు. "మునియే" అనే నమ్మాழ்వార్ల (తిరువాయ్-10-10-1) సూక్తి స్మరణీయం.

(మనుః) - "మన్యతే జ్ఞాయతే ఇతి మనుః, మన-జ్ఞానే" - తెలియబడేవాడు కనుక మనువు.

(వాయుః) - భూలోకంలో సంచారం చేస్తున్నందున వాయువు అనబడుతున్నాడు. వాయువునకు అంతర్యామి.

(వాయుః) - "స్వయమేవ తత్ర తత్ర వాన్ గచ్ఛతీతి వాయుః" -"సో-భ్యగచ్ఛన్మహాతేజాః శబరీం శత్రుసూదనః" (తానే స్వయంగా ఆయా భక్తులుండే చోటికి వెళ్ళి అనుగ్రహిస్తాడు) అని భట్టర్ వివరణం.

(వహ్నిః) - "దేశరూపేణ విశ్వం వహతి" - (ప్రదేశ భేదంతో సమస్త విశ్వాన్ని ధరిస్తున్నాడు) అనే భట్టర్ వివరణం స్మరణీయం. "ఒరు మూవులకుమ్ వయిற்றில் కొణ్డు నిన్ఱ వణ్ణమ్ నిన్ఱ మాల్" (తిరువాయ్-10-8-9) అని ఆళ్వార్ల సూక్తి.

(ప్రాణః) - శరీరంలోపల సంచరించే వాయువునకు అంతర్యామి.

శ్లోకంలో "ఋతుకర్తా" అనే పదం "ప్రభాకరః" అనే విశేష్యపదానికి విశేషణం. వసంతాది ఋతువులను కల్గించే ఈ ప్రభాకరుడే బ్రహ్మ, విష్ణువు, శివుడు - అనే క్రమంలో శ్లోకంలోని పదాలను గ్రహించి అర్థం చెప్పాలి.

## మహేశ్వరతీర్థవ్యాఖ్యానాదివిశేషాలు

(పితరః) - బీజప్రదాతలైన పితృదేవతలకు ఆత్మ - అని అర్థం. సమస్త జీవులను ప్రకృతి అనే క్షేత్రంలో ఉంచేవాడు భగవానుడు. "తాసాం బ్రహ్మ మహద్యోని అహం బీజప్రదః పితాః" అనే గీతా సూక్తి దీనిని తెల్పుతున్నది.

(వసవః) - వసువులనే ఎనిమిదిమందికి అంతర్యామి - అని అర్థం. ఎల్లప్పుడు ఉంటారు కనుక వారికి వసువులని పేరు. వారు ఎనిమిదిమంది; ధ్రువుడు, ధరుడు, సోముడు, ఆపస్సు, వైశ్వానరుడు, అనిలుడు, ప్రత్యూషుడు, ప్రభాసుడు - అని. లేక, అగ్ని, పృథివి, వాయువు, అంతరిక్షం, ఆదిత్యుడు, దివి, చంద్రుడు, నక్షత్రాలు- అనేవారు ఎనిమిదిమంది వసువులు. "అగ్నిశ్చ పృథివీ చ వాయుశ్చాంతరిక్షం చ ఆదిత్యశ్చ ద్యౌశ్చ చంద్రమాశ్చ నక్షత్రాణి వై తే వై వసవః" అనే వేదవాక్యం దీనిని తెల్పుతున్నది. ఈ ఎనిమిదిమందిని కాళిదాసు "యా సృష్టిః స్రష్టు రాద్యా" అనే అభిజ్ఞానశాకుంతలనాటక ప్రారంభంలోని శ్లోకంలో తెలిపాడు.

(సాధ్యాః) - సిద్ధిని కల్గినవారు సాధ్యులు. వీరు పన్నెండుమంది- అని వాయు పురాణంలోని ఈ సూక్తి తెల్పుతున్నది. "బ్రహ్మణో వైముఖాత్ సృష్టా యే తు దేవాః ప్రజేప్సయా, సాధ్యా మంత్రశరీరాస్తే స్థితా మన్వంతరేష్వపి, ధర్మపుత్రా మహాభాగా విజ్ఞేయా ద్వాదశామరాః, మనుర్మంత్రః ప్రాణదశ్చ చేతయానశ్చ వీర్యవాన్, విత్తిర్జయో నయశ్చైవ హంసో నారాయణస్తథా, ప్రభవో-థ విదుశ్చైవ సాధ్యా (విష్ణుః) ద్వాదశ జజ్ఞిరే" అనేది ఆ పురాణసూక్తి. దీనినిబట్టి మనువు, మంత్రుడు, ప్రాణదుడు, చేతయానుడు, వీర్యవంతుడు, విత్తి, జయుడు, నయుడు, హంసుడు, నారాయణుడు, ప్రభవుడు, విష్ణువు - అనేవారు సాధ్యులు. (వీరి నామాలలో కొంత భేదం కన్పిస్తున్నది.) లేక, యోగసాధన ద్వారా సాధింపబడేవాడు పరమాత్మ కనుక సాధ్యశబ్దవాచ్యుడు - అనికూడా అర్థం.

(అశ్వినౌ) బడబారూపిణి (గుఱ్ఱపు ముఖాన్ని కల్గిన) అయిన సంజ్ఞాదేవితో, అశ్వరూపాన్ని దాల్చిన ఆదిత్యుడు సంగమించినపుడు కల్గిన కవలలు అశ్వినీ దేవతలు. వీరు దేవ వైద్యులు. వీరికి అంతర్యామి నారాయణుడు అని అర్థం.



"అశూ-వ్యాప్తౌ" అనే ధాతువును బట్టి అంతటా వ్యాపించేవాడని కూడా అర్థం.

(మరుతః) - ఏనాటికీ మరణించనివారు మరుత్తులు. వీరు 49 మంది. శుక్రుడు, జ్యోతిస్సు మొదలైనవారు. వీరికి అంతర్యామి - అని అర్థం. అనర్థాన్ని అంతంచేసేవాడు కనుక "మరుతః" అని పరమాత్మ చెప్పబడుతున్నాడు. ఈ అర్థం "మృ" అనే ధాతువును ఆధారంగా చేసికొని చెప్పబడింది.

(మనుః) జగత్సృష్టినిగూర్చి మననం చేసేవాడు మనువు. "నాన్యతో-స్మి మంతా" అనే శ్రుతివాక్యం దీనిని తెల్పుతున్నది. సర్వజ్ఞుడని కూడా అర్థం. "మను-అవబోధనే" అనే ధాతువును స్మరించాలి.

(వాయుః) - అంతటా పరిమళింపజేసేవాడు కనుక వాయువని పేరు. అన్ని కర్మలను చేసేవాడనికూడా అర్థం. "వా - గతి గంధనయోః" అనే ధాతువునుండి ఈపదం పుట్టింది. "సర్వనామ స్సర్వగంధ స్సర్వరసః" అని శ్రుతి భగవానుని గూర్చి తెల్పుతున్నది. గత్యర్థాన్నిబట్టి సమస్తవస్తువిషయకమైన జ్ఞానాన్ని కల సర్వజ్ఞుడు, సర్వవేత్త - అని అర్థం. లేక, పంచప్రాణ వాయువులకు నిర్వాహకుడని అర్థం.

(వహ్నిః)- హవ్యాన్ని వహించేవాడు వహ్ని. "వహ - ప్రాపణే" అనే ధాతువునుండి పుట్టిన శబ్దం ఇది. "ఇష్టాపూర్తం బహుధా జాతం జాయమానం విశ్వం బిభర్తి భువనస్య నాభిః, తదేవాగ్ని స్తద్వాయు స్తత్సూర్య స్తదు చంద్రమాః" అనే శ్రుతిని స్మరించాలి. లేక, అన్నిటిని వహించేవాడు - భరించేవాడని అర్థం.

(ప్రజాప్రాణః)-"కో హ్యేవాన్యాత్ కః ప్రాణ్యాత్ యదేష ఆకాశ ఆనందో న స్యాత్" అనే శ్రుతినిబట్టి ప్రజలకు ప్రాణనహేతువు (జీవించడానికి హేతువు) - అని అర్థం.

(ఋతుకర్తా) - సకలభూతాలలో ప్రవేశించి అంతర్యామిగా నిలచి ఉండి, అన్ని కర్మలను చేయించేవాడు. "అంతః ప్రవిష్టం కర్తార మేతమ్" అని,"అథ రథాన్ రథయోగాన్ పథః సృజతే స హి కర్తా సర్వకర్మా" అనే శ్రుతులు దీనిని తెల్పుతున్నది.

"ప్రజాప్రాణ ఋతుకర్తా" అని సమాసపదంగా గ్రహించి, "ప్రజాకర్తా, ప్రాణకర్తా, ఋతుకర్తా" అనే మూడు నామాలుగా కూడా విభజించి ఈ సమస్తపదం వివరింపబడింది.

(ప్రజాకర్తా) - ప్రకృష్టమైన - గొప్ప - జన్మను కలవారు ప్రజలు. లేక, దేవతలు.

ప్రతిజీవునిలో ఆత్మగా ఉండి జన్మింపజేస్తాడు కనుక భగవానుడే ప్రజాకర్త - అని అర్థం.

(ప్రాణకర్తా) - ప్రాణయాత్రాప్రవర్తకుడని అర్థం. జీవులను అన్నిటిని జీవింప జేసేవాడు నారాయణుడు. "న ప్రాణేన నాపానేన మర్త్యో జీవతి కశ్చన, ఇతరేణ తు జీవంతి యస్మిన్నేతా ఉపాశ్రితాః" - అనే శ్రుతివాక్యం ప్రాణ - అపానాది వాయువులతో జీవులు జీవించడం లేదని, అంతకంటే వేఱయిన భగవానునివల్ల జీవిస్తున్నాయని, అతనినే జీవులు ఆశ్రయించి ఉన్నాయని తెలిపింది.

(ఋతుకర్తా) - "ఋ-గతౌ" అనే ధాతువునుబట్టి ఋతువు అంటే జ్ఞానం అనే అర్థం. జ్ఞానాలకు అన్నిటికి కారణుడు, జ్ఞానస్వరూపుడు, జ్ఞాన గుణకుడు, పరమాత్మ. లేక, వసంతాది ఋతువులకు కారణుడు. "ఋతుః సంవత్సరః కాలః" అనే సహస్రనామస్తోత్రసూక్తి భగవానుడు ఋతుశబ్దవాచ్యుడని తెల్పుతున్నది. ఆ ఋతువులకు కారకుడు, సంవత్సరరూపుడు నారాయణుడే.

(ప్రభాకరః) - ప్రకృష్టమైన (గొప్ప) జ్ఞానానికి సాధనమై ఉండేవాడని అర్థం. ప్రకృష్టజ్ఞానమంటే భక్తి. "తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్, దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాంతి తే" అనే భగవద్గీతావచనం దీనిని తెల్పుతున్నది. ప్రభ అంటే ప్రకాశం. దానిని కల్గించేవాడు. ప్రకాశానికే ప్రకాశాన్ని కల్గించేవాడని అర్థం. "తస్య భాసా సర్వమిదం విభాతి" అని శ్రుతి ఈ అర్థాన్ని తెల్పింది.

ఈ శ్లోకం వరకు పూర్వపీఠికాభాగం.

10) ఆదిత్యః సవితా సూర్యః ఖగః పూషా గభస్తిమాన్ ।
సువర్ణసదృశో భానుః హిరణ్యరేతా దివాకరః ॥

భూమికి, నాయుడు, లోకాలను సృష్టించేవాడు, ప్రాణులను ప్రేరేపించే వాడు, ఆకాశంలో సంచరించేవాడు, వర్షంద్వారా లోకాలకు బలాన్ని కల్గించేవాడు, కిరణాలను కలవాడు, హిరణ్మయుడు, ప్రకాశించేవాడు, హిరణ్మయమైన బ్రహ్మాండాన్ని నిర్మాణం చేసేవాడు అయిన ఈ ఆదిత్యుడు పగటికాలానికి కారణమైనవాడు.

వ్యాఖ్యానం : ఈవిధంగా ఇంతవరకు ఆదిత్యుని స్వరూపాన్ని ఉపదేశించి, ఆ ఆదిత్యునకు చెందిన ఆదిత్యహృదయస్తోత్రాన్ని ఈ శ్లోకంనుండి అగస్త్యుడు



ఉపదేశిస్తున్నాడు. ఈ ఆదిత్యహృదయస్తోత్రం "ఆదిత్యః", "సవితా" ఇత్యాదిగా ఆరంభమై, "లోకసాక్షిణే" (21వ శ్లోకం లోని) అనే పదంతో పూర్తి అవుతున్నది. ఈ స్తుతిలోని "ఆదిత్యః సవితా" ఇత్యాదిగా కొన్ని నామాలు ప్రథమావిభక్తిలో ఉన్నాయి. వీటికి "త్వమ్" అనే దాన్ని చేర్చుకొని, "నీవు ఆదిత్యుడవు, సవితవు" అని అర్థాన్ని చెప్పాలి. కొన్ని చతుర్థీ విభక్తిలో ఉన్నాయి. వాటికి "నమః" అనే పదాన్ని చేర్చి, "అటువంటి నీకు నమస్కారం" అనే అర్థాన్ని చెప్పాలి.

(ఆదిత్యః) - అదితికి కుమారుడు ఆదిత్యుడు. లేక, "అదితి" అంటే అఖండమైనభూమండలం. దానికి పతి కనుక ఆదిత్యుడనబడుతున్నాడని కూడా చెప్పవచ్చు. ఈ నామాన్ని శ్రీ పరాశరభట్టర్ తమ సహస్రనామభాష్యంలో ఆదిత్య మండలాంతర్యామి అయిన భగవానుని పరంగా వివరించారు.

(ఆదిత్యః) - "స్వవాచకాత్ ఆవర్ణాత్ ఆత్ ఇత్యః ప్రాప్యః ఇతి ఆదిత్యః" (సంకర్షణుని బోధించు బీజాక్షరమైన 'ఆ' అనే వర్ణం వల్ల పొందదగినవాడు) అనే భట్టర్ వివరణం స్మరణీయం.

(సవితా) - జగత్తును ప్రభవింపజేసేవాడు. ఇది ద్వాదశాదిత్యనామాలలో ఒకటి.

(సవితా) - "సూర్యద్వారా వృష్టిసస్యాదికం సూతే ఇతి సవితా" (సూర్యుని ద్వారా వర్షం, దానిద్వారా సస్యాలను కల్గిస్తాడు కనుక సవిత)-అనే భట్టర్ వివరణం గ్రాహ్యం.

"సర్వేషాం సాక్షాత్ జనయితా సవితా" - చేతనాచేతనాత్మక ప్రపంచానికి సాక్షాత్తు ఉత్పాదకుడు - అని భట్టర్ చేసిన ఇంకొక వివరణం కూడా స్మరణీయం.

(సవితా) - "సువతి - ప్రేరయతి ఇతి సవితా" - తనకిరణాలతో లోకాలకు ప్రేరణ కల్గిస్తున్నాడు.

(సూర్యః) - "సువతి - ప్రేరయతి కర్మాణి" - జగత్తును అంతటిని తన కిరణాల ద్వారా ప్రేరణను కల్గించేవాడు - అని అర్థం. లేక "సుష్ఠు ఈరయతి" - ఏ ప్రయోజనాన్ని ఆశించకుండా నిర్హేతుకంగా అందఱిలో ఉండి చక్కగా ప్రేరణ చేసేవాడు - అని అర్థం.

(సూర్యః) - స్థావరజంగమాత్మకజగత్తుకు అంతర్యామి - అని అర్థం. "సూర్య ఆత్మా జగత స్తస్థుషశ్చ" అని అంటూ శ్రుతి ఈ విషయాన్ని తెల్పింది - అని

తనిశ్లోకి వివరణం.

(ఖగః) - లోకోపకారంకోసం ఆకాశంలో సంచరించేవాడు.

(పూషా)-వర్షంతో లోకాన్ని పోషించేవాడు. (సూర్యుని తాపమే వర్షానికి కారణం)

(గభస్తిమాన్) - కిరణాలను కలవాడు. "గభస్తి" అంటే సూర్యకిరణం. దివ్యాయుధాలను కలవాడని కూడా అర్థం. గభస్తి పదానికి సుదర్శనమనే అర్థాన్ని భట్టర్ సహస్రనామభాష్యంలో తెలియజేశారు.

(సువర్ణసదృశః) - బంగారు వన్నెను కలవాడు. ఆదిత్యమండలంలో వేంచేసి ఉండే భగవానుని ఛాందోగ్యోపనిషత్తు "హిరణ్యశ్మశ్రుః హిరణ్యకేశ ఆప్రణఖాత్ సర్వ ఏవ సువర్ణః" (బంగారు రంగులోని మీసాలను కలవాడు, బంగారు రంగులోని కేశాలను కలవాడు, నఖాల పర్యంతం పూర్తిగా బంగారు వన్నెను కలవాడు) అని తెలిపింది.

(భానుః) - "సర్వనిర్మాణే-పి అవికుర్వాణో భాతీతి భానుః" - అనంత ప్రపంచాన్ని సృష్టించినా ఏవికారం లేకుండా ప్రకాశించేవాడు కనుక భాసువు అనే భట్టర్ వివరణం ఇక్కడ గ్రాహ్యం. దీని ద్వారా భగవానుని వీర్యగుణం తెలుపబడింది. "వీ*ఱ్ఱి* రున్దే*ழ* లకుమ్ తనిక్కోల్ శెల్ల వీవిల్ శీర్ ఆ*ఱ్ఱ*ల్ మిక్కాళుమమ్మాన్" (తిరువాయ్-4-5-1) అని ఆ*ழ*్వార్ల సూక్తి.

(భానుః)- "అతిభాస్వరేణ సహస్రాంశునా-ప్యుపజీవ్యతే భాభాతి ఇతి భానుః" - "యస్యాదిత్యో భాముపయుజ్య భాతి ఇతి" (గొప్ప తేజస్సును కల సూర్యునకు కూడా ప్రకాశాన్ని కల్గించేటట్లు గొప్పగా వెలిగేవాడు కనుక భానువు) అనే భట్టర్ వివరణం కూడా స్మరణీయం. "తిజ్గళుమ్ ఞాయిఱుమాయ్ చ్చె*ழ*ుమ్ పల్ శుడరాయ్ మాయా" (పెరియ తిరు-7-8-2) అనే దివ్యసూరి సూక్తి భావ్యం.

(హిరణ్యరేతాః) - బంగారు వన్నెను కల బ్రహ్మాండాన్ని సృష్టించినవాడు. "తదండమభవత్ హైమం సహస్రాంశుసమప్రభమ్" (ఆ బ్రహ్మాండం బంగారు వన్నెను కల్గినదై సూర్యుని కాంతివంటి కాంతిని కల్గినది అయినది) అని మనుస్మృతి లోని వచనం ఈ శ్లోకంలో ఒక అక్షరం అధికంగా ఉన్నా, అది మహర్షి ప్రోక్తం కనుక దోషం లేదు.

(దివాకరః) - పగటి కాలాన్ని కల్గించేవాడు - అని కాని, పగటికాలంలో



ప్రాణు లను ప్రేరేపించేవాడు - అని కాని భావం.

## మహేశ్వరతీర్థవ్యాఖ్యానాదివిశేషాలు

(ఆదిత్యః) - "యస్మాత్సర్వమాదత్తే తస్మాదాదిత్యః" (ఎందువలన అన్నిటిని గ్రహిస్తున్నాడో అందువల్ల ఆదిత్యుడనబడుతున్నాడు) అనే వ్యుత్పత్తివల్ల సమస్త విషయాలను అనుభవించేవాడు, గ్రహించేవాడు ఆదిత్యుడు. సర్వభోక్తకదా భగవానుడు. "యస్య బ్రహ్మ చ క్షత్రం చ ఉభే భవత ఓదనమ్" అనే శ్రుతి ఈ విషయాన్ని పల్కింది.

(సవితా) - సమస్తజగత్తును ప్రసవించేవాడు.

(సూర్యః) - అందఱిని ఆయా కర్మలలో ప్రేరేపించేవాడు -అని గాని, చక్కగా ప్రేరేపించేవాడు - అని గాని దీని అర్థం. ప్రేరేపించడంలో భగవానునకు గల గొప్పతనం ఏమంటే - అది సహజమై ఉండడం. "అంతఃప్రవిష్టః శాస్తా జనానామ్ సర్వాత్మా" అని, "యస్సర్వాణి భూతాన్యంతరో యమయతి" అనికదా వేదసూక్తి.

(ఖగః) పరమాకాశ మనబడే పరమపదంలో సంచరించేవాడు, అక్కడ వేంచేసి ఉండేవాడని అర్థం. "యో అస్యాధ్యక్షః పరమే వ్యోమన్" అనే శ్రుతి దీనిని తెలియ జేస్తున్నది.

(గభస్తిమాన్) - అన్ని దిశలలో వ్యాపించి ప్రకాశిస్తున్నది "గభస్తి". అంటే - లక్ష్మీదేవి. ఆమెను కల్గినవాడని అర్థం. లక్ష్మీవిశిష్టుడని తాత్పర్యం. ఈపదంలోని "మతుప్" ప్రత్యయం నిత్యయోగాన్ని సూచిస్తుంది. భగవానునివలెనే లక్ష్మీదేవికూడా ఆ భగవానునితో పాటు సర్వత్ర వ్యాపించి ఉంటుందనే విషయం "యథా సర్వగతో విష్ణుః తథైవేయం ద్విజోత్తమ!" అనే విష్ణుపురాణసూక్తివల్ల తెలుస్తున్నది.

(సుపర్ణః) - "ద్వా సుపర్ణా సయుజా సఖాయౌ" ఇత్యాదిగా ముండకోనిషత్తులో చెప్పబడిన రీతిలో సుపర్ణశబ్దంచే తెలుపబడే పరమాత్మ - అని అర్థం.

(తపనః) - శత్రువులను తపింపజేసేవాడు. "సుఖసుప్తః పరంతపః" అనే శ్రీరామాయణసూక్తి స్మరణీయం.

(భానుః) గొప్పగా ప్రకాశించేవాడని అర్థం. "తమేవ భాంత మనుభాతి సర్వమ్" అనే శ్రుతి స్మరణీయం. ప్రకాశించే ద్రవ్యాలన్నీ ఇతనినిబట్టే ప్రకాశిస్తున్నాయి.

(దివాకరః) - అజ్ఞానాన్ని నివర్తిపజేయడంద్వారా పగలును - అంటే - జ్ఞానాన్ని కల్గించేవాడని అర్థం.

11) హరిదశ్వః సహస్రార్చిః సప్తసప్తిర్మరీచిమాన్ ।
తిమిరోన్మథనః శంభుః త్వష్టా మార్తాండ అంశుమాన్ ॥

ఈ ఆదిత్యుడు - ఆకుపచ్చని రంగులోని అశ్వాలను కలవాడు, "వేయి కిరణాలను కలవాడు. "సప్త" అనే పేరును కల అశ్వాన్ని కలవాడు, కిరణాలతో కూడినవాడు. చీకటిని పారదోలేవాడు. మంగళాలను కల్గించేవాడు. అన్నిటిని లయం చేసే శక్తిని కలవాడు. లయాన్ని పొందిన ఈ జగత్తును తిరిగి సృష్టించేటపుడు. ఆవిర్భవించేవాడు. కిరణాలతో ప్రకాశించేవాడు - అని భావం.

వ్యాఖ్యానం : (హరిదశ్వః) - "హరిత్" అంటే ఆకుపచ్చరంగు. ఆ రంగును కల అశ్వాలను కలవాడని భావం.

(సహస్రార్చిః) - వేయి కిరణాలను (పలు జ్ఞానాలను) కలవాడు.

(సప్తసప్తిః) - "సప్తిః" అంటే గుఱ్ఱం. ఏడు గుఱ్ఱాలను కలవాడని అర్థం. లేక, సూర్యుని గుఱ్ఱానికి "సప్త" అని పేరు. "ఏకో అశ్వో వహతి సప్తనామా" అని వేదం ఈ విషయాన్ని తెల్పింది. "సప్త" అనే పేరును కల అశ్వాన్ని కలవాడని అర్థం.

ఇక్కడ ఒక సందేహం కలుగవచ్చు. గాయత్రి, బృహతి, ఉష్ణిక్, జగతి, త్రిష్టుప్, అనుష్టుప్, పంక్తి - అనే ఏడు వైదికచ్ఛందస్సులు ఏడు ఆకుపచ్చని గుఱ్ఱాలుగా రూపొంది సూర్యరథాన్ని వహిస్తాయి - అని, "సప్త యుంజంతి రథమేక చక్రమ్" (సూర్యుని రథానికి ఏడు గుఱ్ఱాలు. ఒకటే చక్రం) అని చెప్పే వేద వాక్యాలతో "సప్త" అనే పేరును కల ఒకే అశ్వం సూర్యరథాన్ని మోస్తున్నదని అనడం పొసగదు కదా! - అని అంటే, ఈ సందేహాన్ని అవకియ మణవాళ ప్పెరుమాళ్ అనే ఆచార్యులు సమాధానిస్తూ - "వేదరూపమైన హరిదశ్వం ఏడు ఛందస్సుల రూపాలను, ఆ రూపాలకు అనుగుణమైన ఏడు పేర్లను కల్గినదై, సూర్యరథాన్ని వహిస్తుంది - అని, ఈ ఏడు అశ్వాలు "సప్త" అనే ఆకుపచ్చని అశ్వంయొక్క ప్రతిరూపాలే - అని వేదమే తెల్పింది. కనుక విరోధం లేదని తెలియజేశారు.

(మరీచిమాన్) - "మరీచి" అనబడే కిరణాలను కలవాడు. ప్రకాశాన్ని



(జ్ఞానాన్ని) కలవాడని అర్థం.

(తిమిరోన్మథనః) - చీకట్లను మథించేవాడు (అనిష్ట నివారకుడు).

(శంభుః) - లోకాలకు సుఖాన్ని కల్గించేవాడు - అని అర్థం (ఇష్ట ప్రాపకుడు).

(త్వష్టా) - పన్నెండుమంది ఆదిత్యుల నామాలలో ఇది ఒకటి. అన్ని రూపాలను లయింపజేసేవాడు, లయకర్త - అని అర్థం. ఈ నామానికి పరాశరభట్టర్ తాను సృజించిన జగత్తుకు నామరూపాలను కల్గించేవాడనే అర్థాన్ని చెప్పారు. అదికూడా ఇక్కడ గ్రాహ్యమే.

(త్వష్టా) - "నిర్మితం నామరూపవ్యాకరణేన సురనరాదివైచిత్ర్యవిభక్తం వ్యనక్తి"- తాను నిర్మించిన ప్రపంచానికి నామరూపాలను ఏర్పరచి, సురులు, నరులు, తిర్యక్కులు మొదలైన పలు ప్రాణులుగా వ్యక్తీకరిస్తున్నాడు. "సర్వాణి రూపాణి విచిత్య ధీరః" ఇత్యాదిగా భట్టర్ చేసిన వివరణం అనుసంధేయం.

(మార్తాండః) - మృతమైన అండంనుండి పుట్టినవాడని అర్థం. సర్వం సంహరింపబడినపుడు, మళ్ళీ సృష్టించడంకోసం ప్రాదుర్భవించినవాడని అర్థం - అని తనిశ్లోకి వివరణం.

(అంశుమాన్) - పలు కిరణాలను కలవాడు, కిరణాలతో ప్రకాశించేవాడని అర్థం. అంతటా వ్యాపించిన జ్ఞానాన్ని కలవాడని కూడా అర్థం.

## మహేశ్వరతీర్థవ్యాఖ్యానాదివిశేషాలు

(హరిదశ్వః) మనస్సును హరించే - అంటే - మనోహరమైన అశ్వాన్ని -అంటే - వాహనమైన గరుడుని కలవాడని అర్థం.

(సహస్రార్చిః) - భగవానుని కల్యాణగుణాలు అర్చింపబడతాయి కనుక, అవి అర్చిస్సులనబడుతున్నాయి. అటువంటి కల్యాణగుణాలు సహస్రం. అంటే - అనంతమైన - కల్యాణగుణాలను కలవాడని అర్థం.

(సప్తసప్తిః) - "సప్త" అనే అశ్వాన్ని వాహనంగా కలవాడని అర్థం. ఈ నామం కల్క్యవతారాన్ని సూచిస్తుంది.

(మరీచిమాన్) - దీనిచేత శత్రువులు మరణిస్తున్నారు కనుక, శ్రీసుదర్శనం "మరీచి" అనబడుతున్నది. అటువంటి చక్రాన్ని ఆయుధంగా కలవాడని అర్థం.

చక్రాన్ని మాత్రం ఇక్కడ చెప్పినా, భగవానుని మిగిలిన దివ్యాయుధాలన్నీ దీనివల్ల సూచింపబడతాయి కనుక, శంఖచక్రాది సమస్తదివ్యాయుధో పేతుడని అర్థం.

(తిమిరోన్మథనః) - జ్ఞానోత్పత్తికి ప్రతిబంధకమైన దోషాలను పోగొట్టేవాడని అర్థం. "హృద్యంతస్థో హ్యభద్రాణి విధునోతి సుహృత్ సతామ్" (సత్పురుషులకు స్నేహితుడైన భగవానుడు హృదయం లోపల ఉన్నవాడై, అమంగళాలను పారదోలుతున్నాడు) అని స్మృతివచనం.

(శంభుః) - "శంభ వత్యస్మాత్" సుఖాన్ని కల్గించేవాడు. "విశ్వాక్షం విశ్వ సంభువమ్" అనే వేదవాక్యం స్మరణీయం.

(త్వష్టా) - ఇరవై ఒక్కమార్లు భూమిలోని క్షత్రియుల వధను చేసినవాడని అర్థం. ఈ నామం పరశురామావతారాన్ని సూచిస్తుంది.

(మార్తాండః) - మృతమైన - అంటే - అచేతనమైన బ్రహ్మాండాన్ని జీవింప జేసేవాడు. "జీవాజీవ మజీవయత్" అనే భాగవతసూక్తి ఈ అర్థాన్ని తెల్పుతున్నది.

(అంశుమాన్) - "అశూ-వ్యాప్తౌ" అనే ధాతువునుబట్టి లోపల, బయట వ్యాపించి ఉండేవాడు. "అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః" అనే వేదవాక్యం స్మరణీయం.

12) హిరణ్యగర్భః శిశిరః తపనో భాస్కరో రవిః ।
అగ్నిగర్భో-దితేః పుత్రః శంఖః శిశిరనాశనః ॥

బంగారుమయమైన బ్రహ్మాండం నడుమ వెలిగేవాడు, తాపత్రయాల వల్ల పీడింపబడి, తనను ఆశ్రయించినవారికి విశ్రాంతిని కల్గించేవాడు. శత్రువులను తపింపజేసే స్వభావాన్ని కలవాడు, కాంతిని కల్గించేవాడు, అందఱిచే స్తుతింపబడే వాడు, పగటివేళ తనలో అగ్నిని అంతర్భవింపజేసికొన్నవాడు, అదితి కుమారుడు, సాయంకాలంలో తానే స్వయంగా చల్లబడేవాడు, చలిని పోగొట్టేవాడు.

వ్యాఖ్యానం : (హిరణ్యగర్భః) - హిరణ్మయమైన బ్రహ్మాండంలోపల వర్తించేవాడని అర్థం లేక, హితమై, రమణీయమైన గర్భాన్ని - అంటే - మనస్సును కలవాడనికూడా అర్థాన్ని చెప్పవచ్చు. మొదటి వివరణను భట్టర్‌కూడా తమ సహస్రనామ భాష్యంలో తెలిపారు. కాని, పరమపదమనబడే లోకంలో వర్తించేవాడనే అర్థాన్ని గ్రహించారు.

"హిరణ్మయే పరే లోకే" అని "పురం హిరణ్మయిమ్!" అని వేదం, "పొన్నులకు"



అని ఆళ్వార్లు పరమపదాన్ని బంగారులోకమని అన్నారుకదా! హిరణ్యశబ్దానికి హితమైన, రమణీయమైన ఉపాసకుని హృదయమని అర్థం. ఆ ఉపాసకుని హృదయంలో గర్భంవలె దివ్యమంగళ విగ్రహంతో వేంచేసి ఉంచాడు కనుక హిరణ్య గర్భుడనే ఇంకొక వివరణాన్ని కూడా 412వ నామానికి భట్టర్ తెలిపారు. ఇవి రెండు ప్రకృతంలో ఆదిత్యమండలంలో వేంచేసి ఉండే పరమాత్మ విషయంలో అన్వయించవచ్చు.

(హిరణ్యగర్భః) - "నిర్దోషనిరఘునిత్యపరమసర్వాత్మక ద్రవ్యవిశేషత్వేన హిరణ్య సామ్యాత్ హితమ్, రమణీయమితి వా హిరణ్యం పరం ధామ, తస్య గర్భభూతః తత్ర నిత్యనివాసాత్" అని భట్టర్ ఈ నామాన్ని హిరణ్యశబ్దంచేత నిర్దేశింపబడే పరమపదంలో నిత్యనివాసం చేసే పరరూపాన్ని తెల్పుతున్నదని అంటూ చేసిన వివరణం స్మరణీయం. ఏ దోషం, పాపం లేనిది, నిత్యమైనది, శుద్ధ సత్త్వాత్మక మైనది కనుక, లేక, హితమై, రమణీయమైనది. కనుక హిరణ్యమనే పదం చేత పరమపదం చెప్పదగినదనే అచటి వివరణం కూడా గ్రహించదగినది "పొన్నులకు" (తిరువాయ్-10-8-11) అని ఆళ్వార్లు కూడా అన్నారు.

(శిశిరః) - ఆధ్యాత్మిక - ఆధిదైవిక - ఆధిభౌతికాలనే మూడు తాపాలవల్ల బాధింపబడేవారికి విశ్రాంతిని కల్గించేవాడు. సహస్రనామ భాష్యంలో ఈ నామం గజేంద్రమోక్షసందర్భంలో అత్యంతం వేగంగా వచ్చిన భగవానుని విషయంగా వివరింపబడింది. అందువల్ల ఆ అవతారాన్ని సూచిస్తుందని చెప్పవచ్చు.

(తపనః) - (భక్తుల శత్రువులను) తపింపజేసేవాడని భావం.

(భాస్కరః) - కాంతిని కల్గించేవాడు.

(రవిః) - అందఱిచే స్తుతింపబడేవాడు. "ఆపూర్యమాణే పక్షే" అని ప్రశంసింపబడే ఉత్తరాయణ పుణ్యకాలాధిదేవతకు 'రవిః' అని పేరు. ఆ ఆతివాహిక పురుషునకు అంతర్యామి - అనే అర్థం సహస్రనామ భాష్యంలో తెలుప బడింది.

(రవిః) - రవిశబ్దవాచ్యమైన ఉత్తరాయణ కాలానికి నిర్వాహకుడని అర్థం.

(రవిః) - "రవ్యతే గమ్యతే ఇతి రవిః, రుజ్-గతౌ"- పొందబడేవాడు - పరమాత్మ. "రూయతే - స్తూయతే ఇతి రవిః, రు-శబ్దే" - స్తుతింపబడేవాడు.

(అగ్నిగర్భః) - పగటివేళ అగ్నిని తనలో కలవాడు. "ఉద్యంతం వా వాదిత్య

మగ్ని రనుసమారోహతి" (ఉదయించే సూర్యుని అగ్ని ఆరోహిస్తున్నాడు) అని వేదం తెల్పింది.

(అదితేః పుత్రః) - అదితికి పుత్రునిగా జన్మించినవాడు.

(శంఖః) - సాయంకాలంలో స్వయంగానే చల్లబడేవాడు.

(శిశిరనాశనః) - మంచును పోగొట్టేవాడు.

## మహేశ్వరతీర్థవ్యాఖ్యానాదివిశేషాలు

(హిరణ్యగర్భః) - సకలజగత్తును ఉత్పాదన చేసే సమష్టిజీవజాతాన్ని తన గర్భంలో కలవాడు. "హిరణ్యగర్భః స్సమవర్తతాగ్రే" అని వేదం, "హిరణ్యగర్భో భూగర్భః" అని విష్ణుసహస్రనామం ఈ విషయాన్ని తెల్పుతున్నవి.

(తపనః) - తనను ఆశ్రయించినవారి విరోధులను తపింపజేసేవాడు.

(భాస్కరః) - సర్వవస్తుసాక్షాత్కారానికి హేతువైనవాడు, లోకకర్త - అని అర్థం.

(రవిః) - వేదాలను ఉపదేశించినవాడు - అని అర్థం. "యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై" (ఎవడు వేదాలనుకూడా ఆ బ్రహ్మకు అనుగ్రహిస్తున్నాడో) అని వేదం తెల్పుతున్నది.

(అగ్నిగర్భః) - కాలాగ్నిరుద్రుని గర్భంలో కలవాడు. "నారాయణాద్రో జాయతే" అని ఈ అర్థాన్ని వేదం పల్కింది.

(అదితేః పుత్రః) - "అదితేః పుమ్ త్రః" అదితిపుత్రుడైన ఇంద్రుని రక్షించేవాడని అర్థం. పలు సందర్భాలలో భగవానుడు ఇంద్రుని కష్టాలనుండి గట్టెక్కించాడు కదా!

(శంఖః) - "శమ్" సుఖాన్ని, "ఖః" హృదయాకాశంలో కలవాడు. హృదయాకాశంలో గొప్ప సుఖాన్ని కలవాడు. నిరవధికమైన ఆనందాన్ని కలవాడు.

13) వ్యోమనాథ స్తమోభేదీ ఋగ్యజుస్సామపారగః ।
ఘనవృష్టి రపాంమిత్రో వింధ్యవీథీ ప్లవంగమః ॥

ఇతడు, ఆకాశానికి అధిపతి, రాహువును భేదించేవాడు. ఋక్కు, యజుస్సు, సామాలనే మూడు వేదాల అవధిని దాటినవాడు, గొప్ప వర్షాన్ని కురిపించేవాడు, జలానికి మిత్రుడు, దక్షిణాయనసమయంలో వింధ్యపర్వత మార్గంలో పయనించేవాడు, పక్షివలె పయనించేవాడు.



వ్యాఖ్యానం : (వ్యోమనాథః) - ఆకాశానికి - పరమాకాశమనబడే పరమపదానికి - అధిపతి.

(తమోభేదీ) - తమశ్శబ్దంచేత చెప్పబడే రాహువును భేదించినవాడు. "ఎన్నై త్తీమనమ్ కెడుత్తాయ్" - అనేరీతిలో అజ్ఞానాన్ని పోగొట్టినవాడు.

(ఋగ్యజుస్సామపారగః) మూడు వేదాల అవధిని దాటినవాడు. "ఋగ్భిః పూర్వాహ్నే దివి దేవ ఈయతే, యజుర్వేదే తిష్ఠతి మధ్యే అహ్నః, సామవేదే నాస్తమయే మహీయతే, వేదైరశూన్యస్త్రిభి రేతి సూర్యః" (ప్రాతఃకాలంలో సూర్యుడు దేవలోకంలో ఋగ్వేదమంత్రాలతో స్తుతింపబడుతున్నాడు. మధ్యాహ్నసమయంలో యజుర్వేదంలో ఉంటాడు. అస్తమయవేళలో సామవేదంచేత మహిమను పొందుతున్నాడు. శూన్యమనబడే దోషాన్ని లేని సూర్యుడు మూడు వేదాలతో స్తుతింపబడుతున్నాడు) అని వేదం పల్కింది.

(ఘనవృష్టిః) - గొప్ప వర్షాన్ని కురిపించేవాడు. "అగ్నౌ ప్రాస్తా ఆహుతిః సమ్యగాదిత్య ముపతిష్ఠతే, ఆదిత్యా జ్జాయతే వృష్టిః వృష్టేరన్నం తతః ప్రజాః" (అగ్నిలో చక్కగా సమర్పింపబడిన ఆహుతులు ఆదిత్యుని చేరుతాయి. ఆదిత్యునివల్ల వర్షం, వర్షంవల్ల అన్నం, అన్నంవల్ల ప్రజలు జన్మిస్తారు) అని స్మృతి తెల్పింది. అందువల్లనే అతడు "అపాంమిత్రః" (నీటికి మిత్రం) అని అనబడుతున్నాడు.

(వింధ్యవీథీ) - దక్షిణాయనకాలంలో వింధ్యపర్వతమార్గంద్వారా పయనించేవాడు.

(ప్లవంగమః) - పక్షివలె పయనించేవాడు. "వింధ్యవీథీ ప్లవంగమః" అని ఈ రెండు పదాలను కలిపి ఒకే నామంగాకూడా గ్రహింపబడుతున్నది. అపుడు వింధ్యవీథిని మార్గంగా కల్గినవాడని అర్థం.

ఇక్కడ ఒక విశేషాన్ని గమనించవచ్చు. "ప్లవన" మంటే నీటిపై తేలి ఆడడం. నీటికెరటాలపై తేలి ఆడే గమనాన్ని కలవాడనే భావాన్ని ప్లవంగమనామం సూచిస్తున్నది. విజ్ఞానశాస్త్రంకూడా కాంతికిరణాలు తరంగ గమనాన్ని కలిగి ఉంటాయని తెల్పుతున్నది.

## మహేశ్వరతీర్థవ్యాఖ్యానాదివిశేషాలు

(వ్యోమనాథః) - తామసాహంకారరూపంలో ఆకాశాన్ని సృష్టించినవాడు. "ఆత్మన ఆకాశ స్సభూతః" అని వేదం పల్కింది.

(తమోభేదీ) - భక్తుల అజ్ఞానాన్ని పోగొట్టేవాడు.

(ఋగ్యజుస్సామపారగః) - సకలవేదాల తాత్పర్యరూపమైనవాడు. "వేదైశ్చ సర్వై రహమేవ వేద్యః" (వేదాలన్నిటిచే తెలియబడదగనవాడను నేనే) అని, "యే చ వేదవిదో విప్రాః యే చాధ్యాత్మవిదో జనాః, తే వదంతి మహాత్మానం కృష్ణం ధర్మం సనాతనమ్" (వేదాలను తెలిసిన పండితులు ఎవరో, అధ్యాత్మజ్ఞానాన్ని కల్గిన జనులు ఎవరో, వారంతా మహాత్ముడైన శ్రీకృష్ణుని సనాతనధర్మంగా పల్కుతున్నారు) ఇత్యాది వచనాలు ఈ అర్థాన్ని తెల్పుతున్నవి.

(ఘనవృష్టిః) - సకలకర్మఫలరూపమైన వర్షాన్ని కురిపించేవాడు. "అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ" (నేనే అన్ని యజ్ఞాలకు భోక్తను, ప్రభువును కూడా కదా!) అని భగవద్గీత, "ఫలమత ఉపపత్తేః" (కర్మఫలం భగవానునివల్లనే కల్గుతున్నది, ఆ విధంగానే కుదురుతుంది కనుక) ఇత్యాది ప్రమాణాలు ఈ అర్థాన్ని తెల్పుతున్నవి.

(అపాం మిత్రః) ప్రళయమహాసముద్రంలో శయనించినవాడు - అని అర్థం. "యమంతః సముద్రే కవయో వయంతి" అనే శ్రుతి దీనిని తెల్పుతున్నది.

(వింధ్యవీథీ ప్లవంగమః) వింధ్యపర్వతంవలె దుర్గమమైన -అంటే -ప్రయాణం చేయడానికి మిక్కిలి కష్టమైన వీథి అయిన సుషుమ్న అనే నాడి ద్వారా వేగంగా జీవుని అంతిమకాలంలో పయనింపజేసి, అతనికి మోక్షాన్ని పొందిస్తాడని అర్థం. "స తాన్ బ్రహ్మ గమయతి" (అతడు ఈ భక్తులకు పరమపదాన్ని పొందిస్తాడు), "హార్దాను గృహీతశ్శతాధికయా" అనే సూక్తులు ఈ అర్థాన్ని తెల్పుతున్నవి.

**14)** ఆతపీ మండలీ మృత్యుః పింగళః సర్వతాపనః ।
కవిర్విశ్వో మహాతేజాః రక్తః సర్వభవోద్భవః ॥

ఎండను కలవాడు, వృత్తాకారరూపంలోని బింబాన్ని కలవాడు, విరోధులను పోగొట్టేవాడు, ఉదయకాలంలో గోరోజనవర్ణాన్ని కలవాడు, మధ్యాహ్న సమయంలో



అందఱిని తపింపజేసేవాడు, పండితుడు, జగత్తును నిర్వహించేవాడు, గొప్ప తేజస్సులను కలవాడు, అందఱిపట్ల అనురాగాన్ని కలవాడు, అందఱి సంసారానికి మూలకారణమైనవాడు.

వ్యాఖ్యానం : (కవిః) - వ్యాకరణాది సర్వశాస్త్రాలను తెలిసినవాడు. హనుమంతునకు వ్యాకరణాది విద్యలను నేర్పినవాడితడే కదా! "కవిః లోకాధ్యక్షః" అని కవిశబ్ద వాచ్యుడు పరమాత్మ క్రాంతదర్శి. ఇతరుల బుద్ధికి అందని విషయాలను కూడ గ్రహించేవాడని అర్థం. "కవిం పురాణ మనుశాసితారమ్" అని గీతా సూక్తి.

(మహాతేజాః) అనాదిగా మిక్కిలి దట్టంగా ఆవరించి ఉండే అజ్ఞానమనే చీకటిని పోగొట్టగల్గిన దివ్యతేజస్సును కలవాడనే అర్థాన్ని ఈ నామానికి (678) తమ భాష్యంలో భట్టర్ తెలిపారు. ఆ అర్థం ఇక్కడ అనుసంధేయం.

## మహేశ్వరతీర్థవ్యాఖ్యానాదివిశేషాలు

(ఆతపీ) - "ఆ-సర్వత్ర, తపః" - జగన్నిర్మాణ సంకల్పాన్ని కలవాడు. సర్వత్ర వ్యాపించిన జగన్నిర్మాణసంకల్పాన్ని కలవాడని అర్థం. "యస్య జ్ఞానమయం తపః " (ఎవని జ్ఞానమయమైన తపస్సు) అని వేదం అంటున్నది. "తప-ఆలోచనే" అనే ధాతువును స్మరించాలి.

(మండలీ) - అలంకరించే ఆభరణానికి మండలమని పేరు. దీనిద్వారా భగవానుని కౌస్తుభాది దివ్యాభరణాలు సూచింపబడుతున్నాయి. సమస్త దివ్యాభరణాలను కల్గినవాడు - అని అర్థం. "కేయూరవాన్ మకరకుండలవాన్ కిరీటీ హారీ" అనికదా ఆదిత్యమండలవర్తి కీర్తింపబడుతున్నాడు.

(మృత్యుః) - ఇక్కడ మృత్యుశబ్దం ప్రకృతిని తెల్పుతుంది. దానిని శరీరంగా కలవాడని అర్థం. "యస్య మృత్యుశ్శరీరమ్" (ఎవనికి మృత్యువు శరీరమో) అని వేదం ప్రకృతిని మృత్యు శబ్దంతో నిర్దేశించింది.

(పింగళః) - అందఱితో కలసి మెలసి ఉండే సౌశీల్యగుణాన్ని కలవాడు. తనకంటే తక్కువవారితో ఏవిధమైన సంకోచం మనస్సులో లేకుండా తన ప్రయోజనంగా భావించి కలువడమే సౌశీల్యగుణం. పింగళనాడిని ప్రవర్తింపజేసి, కర్మమార్గంలో జీవులను వర్తింపజేసేవాడని, పింగళవర్ణాన్ని కలవాడని కూడా అర్థాన్ని చెప్పవచ్చు. ఉదయకాలంలో సూర్యుడు పింగళ వర్ణాన్ని కలిగి ఉంటాడు.

ఉదయించే సూర్యుడే కదా ఈ స్తోత్రంలో ఉపాస్యుడు.

(సర్వతాపనః) - ఒక్కమారుగా సమస్తబ్రహ్మాండాలను సంహరించేవాడు.

(కవిః) - తెలియదగినవానిని అన్నిటిని తెలిసినవాడు. "యస్సర్వజ్ఞ స్సర్వవిత్" అనే శ్రుతి దీనిని తెల్పుతున్నది. కవి అంటే క్రాంతదర్శి కదా.

(విశ్వః) - విశ్వాన్ని శరీరంగా కలవాడు "విశ్వమేవేదం పురుషః" అని శ్రుతి పల్కుతున్నది.

(మహాతేజాః) - గొప్పతేజస్సును స్వరూపంగా, గుణంగా కలవాడు.

(రక్తః) - అందరినీ రంజింపజేసేవాడు.

(సర్వభవోద్భవః) భవమంటే కార్యవర్గం. సమస్తలోకాల ఉత్పత్తికి హేతువైన వాడని అర్థం. సంసారానికి కారణమైనవాడని కూడా అర్థం.

15) నక్షత్రగ్రహతారాణా మధిపో విశ్వభావనః ।
తేజసామపి తేజస్వీ ద్వాదశాత్మన్! నమో-స్తు తే ॥

నక్షత్రాలకు, గ్రహాలకు, తారాగణాలకు ప్రభువువు, విశ్వాన్ని నిలిపేవాడవు, అగ్ని మొదలైన తేజఃపదార్థాలకంటే గొప్ప తేజస్సును కలవాడవు, పన్నెండు రూపాలను కలవాడవైన ఆదిత్యా! నీకు నమస్కారముగుగాక.

వ్యాఖ్యానం : (విశ్వభావనః) విశ్వాన్ని స్థాపించేవాడు. నిర్వహించేవాడు.

(ద్వాదశాత్మన్) - పన్నెండు మూర్తులను కలవాడు. ఒక్కొక్క నెలలో ఒక్కొక్క పేరును కల ఆదిత్యుడు సూర్యరథంలో వేంచేసి ఉంటాడు. "ఇంద్రో ధాతా భగః పూషా మిత్రో అథ వరుణో అర్యమా, అర్చిర్వివస్వాన్ త్వష్టా చ సవితా విష్ణు రేవ చ" (ఇంద్రుడు, ధాత, భగుడు, పూష, మిత్రుడు, వరుణుడు, అర్యముడు, అర్చిస్సు, వివస్వాన్, త్వష్ట, సవిత, విష్ణువు - అనేవి పన్నెండు మంది ఆదిత్యుల పేర్లు) అని స్మృతిగ్రంథంలో తెలుపబడింది. ఈ విధంగా పన్నెండు మూర్తులను కల ఓ ఆదిత్యదేవా! నీకు నమస్కారమని భావం.

## మహేశ్వరతీర్థవ్యాఖ్యానాదివిశేషాలు

(నక్షత్రగ్రహతారాణా మధిపః) - నక్షత్రాలకు, గ్రహాలకు, తారకలకు అంతర్యామి. "య శ్చంద్రతారకమంతరో యమయతి" (ఎవడు చంద్రునిలో, తారకలలో అంతర్యామిగా ఉండి, వానిని నియమిస్తున్నాడో) అని అన్నది శ్రుతి.



(విశ్వభావనః) - విశ్వస్థితికి హేతువు - అని అర్థం. "ద్యౌ స్సచంద్రార్కనక్షత్రం ఖం దిశో భూర్మహోదధిః, వాసుదేవస్య వీర్యేణ విధృతాని మహాత్మనః" (స్వర్గం, చంద్రుడు, సూర్యుడు, నక్షత్రాలతో కూడుకొన్న ఆకాశం, దిక్కులు, భూమి, మహాసముద్రాలు అన్నీ మహాత్ముడైన వాసుదేవుని శక్తిచేత ధరింపబడుతున్నవి) అని చెప్పబడుతున్నది కదా!

(తేజసామపి తేజస్వీ) గొప్ప తేజస్సును కలవాడు - అని అర్థం. "యేన సూర్య స్తపతి తేజసేద్ధః" (ఎవనిచే సూర్యుడు తపింపబడుతున్నాడో, ఎవని తేజస్సుచే ప్రకాశిస్తున్నాడో) అని శ్రుతి పల్కుతున్నది. "సూర్యస్యాపి భవేత్ సూర్యః " (సూర్యునకు కూడా సూర్యుడై ఉన్నాడో) అని శ్రీరామాయణ సూక్తి.

(ద్వాదశాత్మన్) - ద్వాదశాదిత్యమండలాంతర్వర్తి.

16) నమః పూర్వాయ గిరయే పశ్చిమే గిరయే నమః ।
జ్యోతిర్గణానాం పతయే దినాధిపతయే నమః ॥

17) జయాయ జయభద్రాయ హర్యశ్వాయ నమో నమః ।
నమో నమః సహస్రాంశో ఆదిత్యాయ నమో నమః ॥

18) నమ ఉగ్రాయ వీరాయ సారంగాయ నమో నమః ।
నమః పద్మప్రబోధాయ మార్తాండాయ నమో నమః ॥

19) బ్రహ్మేశానాచ్యుతేశాయ సూర్యాయాదిత్యవర్చసే ।
భాస్వతే సర్వభక్షాయ రౌద్రాయ వపుషే నమః ॥

20) తమోఘ్నాయ హిమఘ్నాయ శత్రుఘ్నాయామితాత్మనే ।
కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాం పతయే నమః ॥

21) తప్తచామీకరాభాయ వహ్నయే విశ్వకర్మణే ।
నమస్తమో-భినిఘ్నాయ రుచయే లోకసాక్షిణే ॥

తూర్పుదిశలోని పర్వతంద్వారా గుర్తింపబడేవాడవైన నీకు నమస్కారం. పశ్చిమదిక్కులో గల పర్వతంద్వారా గమనింపబడేవాడవైన నీకు నమస్కారం. వెలిగే జ్యోతిస్సుల గణాలకు అధిపతివైన నీకు నమస్కారం. వగటివేళను నిర్వహించే

నీకు నమస్కారం. నిన్ను ఉపాసించేవారికి జయాన్ని, శుభాన్ని కల్గించే నీకు నమస్కారం. ఆకుపచ్చని రంగును కల అశ్వాలను కల నీకు మళ్ళీ మళ్ళీ నమస్కారం. వేయి కిరణాలను కల నీకు మాటిమాటికి నమస్కారం. ఆదిత్యుడన బడే నీకు మళ్ళీ మళ్ళీ నమస్కారం. నిన్ను ఉపాసించనివారికి ఉగ్రుడవైన నీకు నమస్కారం. అనేకవిధాలుగా జీవులను ప్రవర్తింపజేసే నీకు నమస్కారం. శీఘ్రంగా పయనించే నీకు నమస్కారం. పద్మాలను వికసింపజేసే నీకు నమస్కారం, మార్తాండుడవైన నీకు నమస్కారం.

సృష్టిలయస్థితులను చేసే బ్రహ్మ, శివుడు, అచ్యుతులనే ప్రభువుపు అయిన నీకు నమస్కారం. ఆదిత్యుని రూపంలోని దీప్తిని కల నీకు నమస్కారం. కాంతిని కల నీకు నమస్కారం. అందటిని సంహరించే నీకు నమస్కారం. ఆ లయకాలంలో రౌద్రరూపాన్ని కల నీకు నమస్కారం. చీకటిని సంహరించే నీకు నమస్కారం మంచును హరించే నీకు నమస్కారం. నిన్ను ఆశ్రయించినవారి శత్రువులను సంహరించే నీకు నమస్కారం. అవధి లేని స్వరూపాన్ని కల నీకు నమస్కారం. కృతఘ్నులను వధించే నీకు నమస్కారం. గొప్పగా వెలిగే నీకు నమస్కారం. అగ్ని రూపుడవైన నీకు నమస్కారం. సర్వజగత్తుకు కర్తవైన నీకు నమస్కారం. అజ్ఞానాంధ కారాన్ని పోగొట్టే నీకు నమస్కారం. కాంతిని కల నీకు నమస్కారం. అందటికి అంతర్యామివై, వారు చేసే కర్మలకు సాక్షివైన నీకు నమస్కారం.

వ్యాఖ్యానం : 16వ శ్లోకం నుండి 21వ శ్లోకం వరకు గల ఆఱుశ్లోకాలు ఒకే అన్వయాన్ని కల్గినవి. అందువల్ల కలిపి వివరింపబడుతున్నాయి. ఇవి చతుర్థీ విభక్త్యంతంగా ఉన్నాయి. "నమః" అనే పదాన్ని వీటి చివర చేర్చుకోవాలి.

(జయాయ) - ఉపాసకులకు జయాన్ని కల్గించేవాడవైన నీకు - అని అర్థం. ఈ జయశబ్దాన్ని భట్టర్ ఆశ్రితులచే జయింపబడేవాడని వివరించారు. భగవానుడు భక్తపరాధీనుడు కదా! ఈ శ్లోకాలలో మాటిమాటికి "నమో నమః" అని నమశ్శబ్దం రెండేసిమార్లు గొప్ప ఆదరంవల్ల ప్రయోగింపబడింది. ఒకే అర్థాన్ని ఇచ్చే పలు పదాల ప్రయోగాలు చేయబడినా, ఇది స్తుతి కనుక, చెప్పిన అర్థాన్ని తిరిగి చెప్పడమనే పునరుక్తి దోషం లేదు.

(జయాయ) - "ఆశ్రితైః జీయతే విధేయీ క్రియతే ఇతి జయః యథా - ఆజ్ఞప్తో-హం తపస్వినామ్" (భక్తులచే వశం చేసికొనబడేవాడు కనుక జయుడు) అనే భట్టర్ వివరణం గ్రాహ్యం. "విణ్ణులకుమ్ తరువానాయ్ విరైకిన్టాన్ విదివకైయే" (తిరువాయ్-10-4-3) అని ఆళ్వార్ సూక్తి.



(సహస్రాంశుః) - అనే నామం భగవానుని సర్వజ్ఞత్వ సూచకంగా వ్యాఖ్యానింపబడింది. ఆ వివరణాన్ని ప్రకృతంలో గ్రహించవచ్చు.

(ఉగ్రాయ) - యుగాంతంలో వర్ణాశ్రమధర్మ వ్యవస్థను విరుద్ధంగా వర్తించే వారిని తీవ్రంగా దండించే కల్కిపురుషుని పరంగా ఈ నామం సహస్రనామ భాష్యంలో వ్యాఖ్యానింపబడింది. తనను ఉపాసించనివారిపట్ల భయంకరుడు -అనే అర్థాన్ని గోవింద రాజీయవ్యాఖ్యానకారులు తెలిపారు.

(ఉగ్రాయ) - "శీలదుస్సాధాసాధుసాధకః సంహారాధికారః- పాతాళశయనః కల్కీ యుగావసానే పాపాతిప్రసంగిషు సంకీర్ణవర్ణాశ్రమవ్యవస్థేషు ఉగ్రః" (పాపకార్యాలలో మిక్కిలి ప్రావణ్యాన్ని కల్గి, వర్ణాశ్రమ ధర్మవ్యవస్థను సంకీర్ణం చేసిన స్వైరసంచారులైన దుష్టుల విషయంలో ఉగ్రుడు) అనే భట్టర్ వివరణంవల్ల ఈనామం కల్క్యవతార పరంగా అన్వయించవచ్చు. కల్కి భగవానుని ఉపాసించే మంత్రంలో కూడా "సంహారమూర్తయే" ఇత్యాదిగా ఉగ్రత్వమే ప్రతిపాదింపబడింది.

(వీరః) - సహస్రనామస్తోత్రంలో ఈ నామం రెండు మార్లు (402, 664) కన్పిస్తుంది. మొదటి నామాన్ని శ్రీరామావతారపరంగా, రెండవ నామం అర్చావతార పరంగా వ్యాఖ్యానింపబడింది. రెండు చోట్ల శత్రునిరసనపరంగానే వ్యాఖ్యానింపబడింది.

(సారంగాయ) - ఒక అర్ధ నిముషకాలంలో రెండు వేల యోజనాల దూరం సూర్యుడు ప్రయాణం చేస్తాడని పురాణాలలో తెలుపబడింది. సూర్యుడు అంతటి వేగంతో పయనిస్తాడు.

(పద్మప్రబోధాయ) - పద్మాలను వికసింపజేసేవానికి - అని, శరీరంలో ఉండే జ్ఞానకేంద్రాలైన, పద్మాలను వికసింపజేసేవానికి - అని, హృదయపద్మాన్ని వికసింపజేసేవానికి అని అర్థాలను చెప్పవచ్చు.

(బ్రహ్మేశానాచ్యుతేశాయ) - "మధ్యే విరించగిరిశం ప్రథమావతారః" అని, "బ్రహ్మేశమధ్యగణనా" అని చెప్పబడిన రీతిలో త్రిమూర్తులలో ఒకడై అవతరించిన భగవద్రూపాన్ని ఇచటి అచ్యుతనామం తెల్పుతున్నది. సృష్టిస్థితిసంహారాలను నిర్వహించే త్రిమూర్తులకు ప్రభువని అర్థం. ఈ సూక్తి పరబ్రహ్మ స్వరూపాత్మకమైన

స్తుతికి అనుగుణం. "అసా వాదిత్యో బ్రహ్మ" (ఈ ఆదిత్యుడు పరబ్రహ్మ) అని వేదం అంటున్నది కదా! లేక బ్రహ్మ, ఈశ్వరులనే ఇద్దఱికి అచ్యుతుడైన, ఏవిధమైన లోపం లేని రక్షకుడని చెప్పవచ్చు. "వేదాపహారగురుపాతకదైత్యపీడాద్యాపద్విమోచన మహిష్ఠఫలప్రదానైః" అనే ఆళవందార్ సూక్తి స్మరణీయం. మధుకైటభులు వేదాలను అపహరించినపుడు వాటిని తిరిగి తీసికొనివచ్చి బ్రహ్మకు ఇవ్వడం, బ్రహ్మ హత్యాపాతకంనుండి శివుని విముక్తుని చేయడం - ఇత్యాదులు స్మరణీయాలు. "బ్రహ్మేశాయాచ్యుతేశాయ" అనే ఇంకొక పాఠంకూడా ఉన్నది. అపుడు రెండు నామాలు.

(ఆదిత్యవర్చసే) ఆదిత్యునిలో ఉండే జ్ఞానాన్ని రూపంగా కలవానికి, ఆదిత్య రూపమైన వర్చస్సును కలవానికి - అని అర్థం.

(సర్వభక్షాయ) ప్రళయకాలంలో సమస్తాన్ని సంహరించేవానికి - అని అర్థం. "యస్య బ్రహ్మ చ క్షత్రం చ ఉభే భవత ఓదనమ్, మృత్యుర్యస్యోపసేచనమ్" అని అన్నది శ్రుతి.

(రౌద్రాయ వపుషే) - సంహార కాలంలో రౌద్రరూపాన్ని కలవానికి - అని అర్థం.

(శత్రుఘ్నాయ) - భక్తుల శత్రువులను సంహరించేవానికి - అని అర్థం. "దేవానాం దానవానాం చ సామాన్యమధిదైవతమ్". (దేవతలకు దానవులకు సామాన్య మైన దైవం) అని చెప్పబడే భగవానునకు శత్రువులు ఎవరు? అంటే, భక్తవిరోధులే. "ద్విషదన్నం న భోక్తవ్యం ద్విషంతం నైవ భోజయేత్, పాండవాన్ ద్విషసే రాజన్! మమ ప్రాణా హి పాండవాః" (శత్రువుల అన్నాన్ని భుజించరాదు. శత్రువులకు భోజనం పెట్టరాదు. ఓ రాజా! నీవు పాండవులను ద్వేషిస్తున్నావు. పాండవులు నా ప్రాణాలు కదా) అని శ్రీకృష్ణుడు దుర్యోధనునితో పల్కిన మాట. అందువల్ల భాగవతశత్రువులే భగవానునకు శత్రువులు.

(శత్రుఘ్నాయ) - "విషయేషు విక్షేపణాత్ తేషాం రావణవత్ శత్రుమింద్రియవర్గం వివేకశరైః హంతి శమయతీతి శత్రుఘ్నః- దశేంద్రియాననం ఘోరం యో మనోరజ నీచరమ్, వివేక శరజాలేన శమం నయతి యోగినామ్" (నిశ్చలమైన ఉపాసనను చేసే సాధకుల ఇంద్రియాలకు మనస్సువల్ల క్షోభ కలుగకుండా, వాటిని వివేకమనే బాణంతో మర్దించి, అవి వారికి వశమయేటట్లు



చేసేవాడు) అనే భట్టర్ చేసిన వివరణం స్మరణీయం. "పఱ్ఱలర్ వీయ క్కోల్ కైయిల్ కొణ్డాన్" (పెరియతిరు-2-3-1) అని తిరుమంగైమన్నన్ సూక్తి.

(కృతఘ్నఘ్నాయ) - చేసిన ఉపకారాన్ని మఱచినవాడు కృతఘ్నుడు. భగవానుడు జీవులకు కరణ కళేబర ప్రదానం, శాస్త్ర ప్రదానం, స్థితిగతుల నిర్వహణం మొదలైన ఎన్నో ఉపకారాలను చేస్తున్నాడు. ఆ ఉపకారాలను మరచినవారిని అతడు అంతంజేస్తాడు.

(దేవాయ) - గొప్పగా ప్రకాశించేవానికొఱకు - అని అర్థం. "శ్రద్ధయా దేవో దేవత్వ మశ్నుతే" (శ్రద్ధా అనే నామంచే నిర్దేశింపబడే లక్ష్మిచేత దేవుడైన శ్రీమన్నారాయణుడు దేవత్వాన్ని పొందుతున్నాడు) అనే వేదవాక్యంవల్ల లక్ష్మీసహితుడనికూడా అర్థం. "విద్యా" అనే పేరును కల లక్ష్మితో భగవానుడు ఆదిత్యమండలంలో అంతర్యామిగా వేంచేసి ఉంటాడుకదా! ఈ అర్థాన్ని నమ్మాళ్వార్లు "శెయ్యదోర్ ఞాయిత్తై క్కాట్టి శిరీదరన్ మూర్త్తి యాదెన్టమ్" (ఎఱ్ఱని అద్వితీయుడైన సూర్యుని చూపించి "ఇది శ్రీధరుని మూర్తి" అని అంటున్నది) అని పలికారు. ఇక్కడ శ్రీధరశబ్దం ప్రయోగింపబడడం గమనించాలి. (దేవ శబ్దానికి గల మిగిలిన అర్థాల సమన్వయం అనుబంధంలో చూపబడింది.)

(తప్తచామీకరాభాయ) - "ఆప్రణఖాత్ సర్వ ఏవ సువర్ణః". (నఖాల పర్యంతం అంతా సువర్ణమయుడే) అని వేదం పల్కింది. "శుట్టురైత్త నన్పొన్ తిరుమేని ఒళి ఒవ్వాదు" (బాగా కాచి వడపోసిన మంచి బంగారం కూడా నీ మేనితో సాటి రాదు) అని నమ్మాళ్వార్లు అన్నారు.

(వహ్నయే) - అగ్నిరూపంలో యాగాదులలో సమర్పించిన హవిస్సులను గ్రహించి కొనిపోయేవానికి - అని అర్థం.

(లోకసాక్షిణే) - జీవుల మనస్సులలో అంతర్యామిగా వేంచేసి ఉండి, వారు చేసే పుణ్యపాపరూపకర్మలకు సాక్షిగా ఉండేవానికి - అని అర్థం.

గోవిందరాజీయ వ్యాఖ్యానానుసారం ఆదిత్యహృదయం స్తోత్రం ఇంతటితో పూర్తి అయినది. ఇకపైగల భాగం, ఉత్తర పీఠిక, ఫలశ్రుతి.

## మహేశ్వరతీర్థవ్యాఖ్యానాదివిశేషాలు

(పూర్వాయ గిరయే) - శ్రీవిష్ణుపురాణంలో తెలుపబడిన రీతిలో తూర్పు

దిక్కులో గల ఉదయంపర్వతానికి అంతర్యామి - అని అర్థం.

(పశ్చిమే గిరయే) - పశ్చిమదిక్కులో గల అస్తమయపర్వతానికి అంతర్యామి.

(జ్యోతిర్గణానాం పతయే) - జ్యోతిస్సులంటే ముక్తులు. వారి సమూహానికి అధిపతి - అని అర్థం.

(దినాధిపతయే) - దినానికి అధిపతియైన సూర్యునకు - అంటే - సూర్యునకు అంతర్యామియైన నారాయణునకు - అని అర్థం.

(జయాయ) - అప్రతిహతమైన - ఎదురు లేని - పరాక్రమాన్ని కలవాడు - అని అర్థం. సద్భక్తులు ఇతనివల్ల సంసారాన్ని జయిస్తున్నారని కూడా అర్థం.

(జయభద్రాయ) ఉపాసకులకు రోగాలనుండి పాపాదులనుండి జయాన్ని, కల్గించి మంగళాన్ని పొందించేవాడు.

(హర్యశ్వాయ) - "హరి" అంటే వానరం. ఈపదం ఇక్కడ హనుమానుని నిర్దేశిస్తుంది. హనుమానుని వాహనంగా కలవాడని అర్థం. దీనిద్వారా శ్రీరామావతారం సూచితం. లేక, శ్యామవర్ణాన్ని కల అశ్వాలను కలవాడని అర్థం.

(సహస్రాంశో) - సహస్రసంఖ్యలో - అంటే - లెక్కలేనంతమంది - జీవులను కలవాడు. అంశశబ్దం జీవుని తెల్పుతుంది. "మమైవాంశో జీవలోకే జీవభూతః" అని భగవద్గీత ఈ విషయాన్ని తెల్పుతున్నది.

(సారంగాయ) - సారమైనదానిని గ్రహించేవాడు. దీనిద్వారా హంసావతారం సూచింపబడింది లేక, సారమంటే ప్రణవం. ప్రణవం వేదసారం కదా! ప్రణవంచేత ప్రతిపాదింపబడేవాడని అర్థం.

(బ్రహ్మేశానాచ్యుతేశాయ) సృష్టికర్త అయిన బ్రహ్మకు, స్థితికర్త అయిన అచ్యుతునకు, లయకర్త అయిన ఈశ్వరునకు స్వామి. "సృష్టిస్థిత్యంతకరణీం బ్రహ్మ విష్ణుశివాత్మికామ్, స సంజ్ఞాం యాతి భగవాన్ ఏక ఏవ జనార్దనః" (ఆ భగవానుడైన జనార్దనుడొక్కడే సృష్టి స్థితిలయాలను చేసే బ్రహ్మ, విష్ణు, శివుల రూపంలోని నామాలను పొందుతున్నాడు) అని విష్ణుపురాణం తెల్పుతున్నది.

(సర్వభక్షాయ) - సర్వయజ్ఞఫలాలను అనుభవించేవాడు - అని అర్థం.

(రౌద్రాయ వపుషే) - శత్రుసంహారంకోసం భయంకరమైన రూపాన్ని కలవాడు. దీనిద్వారా నృసింహావతారం సూచింపబడింది. "ఉగ్రం.... భీషణమ్" అనికదా నృసింహానుష్టుభ్ తెల్పింది.

(శత్రుఘ్నాయ) - శత్రువులైన ఇంద్రియాలను నిగ్రహించేవాడు.

(అమితాత్మనే) - అపరిచ్ఛిన్నమైన - అవధి లేని - మహిమను కలవాడు.

(దేవాయ) - స్వయంప్రకాశకుడు.

(వహ్నయే) - "వసూనాం పావకశ్చాస్మి" (వసువులలో నేను పావకుడను) అని గీతలోని విభూత్యధ్యాయంలో శ్రీకృష్ణుడు పల్కినట్లు వహ్నిరూపుడైన వసువునకు అంతర్యామి.

(హరయే) - అనే పాఠాంతరానికి - అశేషమైన అజ్ఞానాన్ని హరించేవాడని అర్థం.

(విశ్వకర్మణే) - విశ్వాన్ని సృజించేవాడు. "సర్వకర్మా సర్వకామః" అని శ్రుతి దీనిని పల్కింది.

(తమో-భినిఘ్నాయ) - తమస్సును - అంటే - అజ్ఞానాన్ని - హరించేవాడు.

(రుచయే) - అందరికి రుచించేవాడు. "ఘృణయే" అనే పాఠాంతరానికి స్వయం ప్రకాశకత్వానికి అద్వితీయమైన సాటి లేని ఆశ్రయమని అర్థం.

22) నాశయత్యేష వై భూతం తదేవ సృజతి ప్రభుః ।
పాయత్యేష తపత్యేష వర్షత్యేష గభస్తిభిః ॥

23) ఏష సుప్తేషు జాగర్తి భూతేషు పరినిష్ఠితః ।
ఏష ఏవాగ్నిహోత్రం చ ఫలం చైవాగ్నిహోత్రిణామ్ ॥

24) వేదాశ్చ క్రతవశ్చైవ క్రతూనాం ఫలమేవ చ ।
యాని కృత్యాని లోకేషు సర్వ ఏష రవిః ప్రభుః ॥

ఈ ఆదిత్యుడు నడిచే ఈ లోకాన్ని సంహరిస్తున్నాడు. ప్రభువైన ఇతడే మళ్ళీ మహాప్రళయం తరువాత జగత్తును సృష్టిస్తున్నాడు. సృష్టించిన లోకాన్ని శోషింపజేస్తున్నాడు. తన కిరణాలతో బాగా తపింపజేస్తున్నాడు, వర్షిస్తున్నాడు. ఇతడు ప్రాణులు నిద్రించేటపుడు వారిలో అంతర్యామియై మేల్కొంటాడు. ఇతడే అగ్నిహోత్ర మనబడే యాగకర్మ. అగ్నిహోత్రమనే యాగకర్మలను చేసేవారికి ఫలరూపుడు కూడా ఇతడే. వేదాలు, క్రతువులు, క్రతువుల ఫలాలు, లోకంలో చేయబడే ఆ

యా కర్మలు - అన్నీ ప్రభువైన ఈ ఆదిత్యుడే.

వ్యాఖ్యానం : అగస్త్యుడు ఇంతవరకు ఆదిత్యహృదయాన్ని ఉపదేశించి, మళ్ళీ ఆ స్తోత్రంద్వారా ప్రతిపాదింపబడే ఆదిత్యుడనబడే దేవతను ఈమూడు శ్లోకాలతో స్తుతిస్తున్నారు. "భూతమ్" అనే పదం ఇపుడు ప్రవర్తించే జగత్తును తెల్పుతుంది. "పాయతి" అంటే ఇంకింపజేస్తున్నాడని అర్థం. సూర్యభగవానుడు లోకంలోని నీటిని తన కిరణాలతో ఇంకింపజేసి, మళ్ళీ వర్షిస్తాడుకదా. లోకంలోని ప్రాణులు నిద్రించేటపుడు వారి ఇంద్రియాలు విశ్రాంతిని పొంది ఉంటాయి. అటువంటి సమయంలోకూడా వారిలో అంతర్యామిగా వేంచేసి ఉండి మేల్కొని ఉండి రక్షించే భగవానుడితడే. సకలవేదాలచేత తెలియబడదగినవాడితడే. సర్వకర్మస్వరూపుడు, ఆ కర్మలచే ఆరాధింపబడేవాడు, ఆ కర్మల ఫలస్వరూపుడు, ఆ ఫలాలను ఇచ్చేవాడు ఇతడే. సర్వాత్మకుడైన ఈ రవియే నియంత.

ఇంతవరకు ఉత్తర పీఠిక. ఇకపై ఫలశ్రుతి తెలుపబడుతున్నది.

25) ఏన మాపత్సు కృచ్ఛ్రేషు కాంతారేషు భయేషు చ ।
కీర్తయన్ పురుషః కశ్చిత్ నావసీదతి రాఘవ! ॥

26) పూజయస్వైన మేకాగ్రో దేవదేవం జగత్పతిమ్ ।
ఏతత్త్రిగుణితం జప్త్వా యుద్ధేషు విజయిష్యసి ॥

27) అస్మిన్ క్షణే మహాబాహో! రావణం త్వం వధిష్యసి ।
ఏవముక్త్వా తదా-గస్త్యో జగామ చ యథాగతమ్ ॥

రాఘవా! ఆపదలలో, కష్టాలలో, భయాన్ని కల్గించే అరణ్యాలలో ఎవడు ఆదిత్యహృదయమనే ఈ స్తుతిని అనుసంధిస్తాడో, అతనికి నాశం లేదు. అందువల్ల నీవు ఏకాగ్రతను కలవాడవై దేవదేవుడు, జగత్తుకు పతి అయిన ఈ ఆదిత్యుని పూజించు. ఈ ఆదిత్యహృదయాన్ని మూడు మార్లు జపించి, యుద్ధాన్ని జయించ గలవు. మహాబాహూ! ఈ క్షణంలోనే నీవు రావణుని వధిస్తావు - అని ఈ విధంగా అపుడు అగస్త్యుడు పల్కి వచ్చిన రీతిలో వెడలిపోయాడు.

వ్యాఖ్యానం : ఇందులో ఈ ఆదిత్యహృదయమనే స్తోత్రాన్ని పఠిస్తే కలిగే ఫలం తెలుపబడింది. ఎవరికైనా ఈ స్తుతిని పఠించే యోగ్యత ఉన్నదనే విషయాన్ని "కశ్చిత్" అనే పదం తెల్పుతున్నది.



28) ఏతత్ శ్రుత్వా మహాతేజా నష్టశోకో-భవత్తదా ।
ధారయామాస సుప్రీతో రాఘవః ప్రయతాత్మవాన్ ॥

29) ఆదిత్యం ప్రేక్ష్య జప్త్వాతు పరం హర్ష మవాప్తవాన్ ।
త్రిరాచమ్య శుచిర్భూత్వా ధనురాదాయ వీర్యవాన్ ॥

అగస్త్యుని ఈ మాటలను గొప్ప తేజస్సును కల శ్రీరాముడు విని, అపుడు చింతను తీరినవాడయ్యాడు. మిక్కిలి సంతోషంతో, వినయంతో ఆ ఆదిత్య హృదయ మంత్రోపదేశాన్ని మనస్సులో నిలుపుకొన్నాడు. గొప్ప వీర్యాన్ని కల అతడు మూడు మార్లు ఆచనమనం చేసి, మిక్కిలి పవిత్రతను కలవాడై, తన కోదండాన్ని గ్రహించి, సూర్యుని చూచి ఆదిత్యహృదయాన్ని జపించి పరమానందాన్ని పొందాడు.

30) రావణం ప్రేక్ష్య హృష్టాత్మా యుద్ధాయ సముపాగమత్ ।
సర్వయత్నేన మహతా వధే తస్య ధృతో-భవత్ ॥

శ్రీరాముడు సంతోషంతో రావణుని చూచి అతనితో యుద్ధం చేయడంకోసం ముందుకు వచ్చాడు. అన్ని విధాలుగాను ప్రయత్నం చేసి ఆ రావణుని వధించాలని నిశ్చయించుకొన్నాడు.

31) అథ రవి రవదన్నిరీక్ష్య రామం
ముదితమనాః పరమం ప్రహృష్యమాణః ।
నిశిచరపతిసంక్షయం విదిత్వా
సురగణమధ్యగతో వచ స్త్వరేతి ॥

శ్రీరాముడు ఆదిత్య హృదయస్తోత్రాన్ని అనుసంధించిన తరువాత దేవగణాల నడుమన ఉండే సూర్యుడు మిక్కిలి సంతోషంతో రామరావణయుద్ధాన్ని చూడగోరి వచ్చి, శ్రీరాముని చూచి త్వరలో రావణుడు నశిస్తాడని గ్రహించి, "శీఘ్రంగా కార్యాన్ని ముగించు" - అనే మాటను పలికాడు.

వ్యాఖ్యానం : "సురగణమధ్యగతః" అని ఇక్కడ చెప్పబడినందున ఆదిత్యుడుకూడా మిగిలిన దేవతలవలె యుద్ధాన్ని చూడడంకోసం తన మండలంనుండి కిందకు దిగి వచ్చి శ్రీరాముని సమీపంలో ఆకాశంలో నిలచి, ఆదిత్యహృదయాన్ని అతడు అనుసంధించినందులకు తగిన ఫలాన్ని ఇచ్చాడని తెలుస్తున్నది.

ఇక్కడ ఒక సందేహం కలుగవచ్చు. యుద్ధం తరువాత బ్రహ్మాదిదేవతలంతా కలసి ఏకకఠంగా "భవాన్ నారాయణో దేవః" (నీవు దేవుడవైన శ్రీమన్నారాయణుడవు) అని శ్రీరాముని స్తుతించి, విష్ణువే అందఱికంటే గొప్పవాడనే విషయాన్ని విస్తృతంగా పలికారు కదా! కాని, ఇక్కడ సూర్యుడే అందఱికంటే గొప్పవాడని ఈ స్తుతిలో తెలుపబడినదే! ఇది ఏవిధంగా పొసగుతుంది? అనేది ఆ సందేహం.

దీనికి సమాధానం ఏమంటే - వేదాంతవిద్యలలో మధువిద్య - అనే ఒక విద్య ఉన్నది. అందులో ఆదిత్యుని ఉపాసన ప్రతిపాదింపబడినా, ఆ ఆదిత్యునకు అంతర్యామిగా ఉండే పరమాత్మను ఉపాసించడంలోనే ఆ విద్యయొక్క తాత్పర్యమని బాదరాయణమహర్షి బ్రహ్మమీమాంసాశాస్త్రంలో తెలిపాడు. అదే రీతిలో ఇక్కడ చెప్పబడిన ఉపాసనకూడా ఆదిత్యునకు అంతర్యామిగా ఉండే శ్రీమన్నారాయణుని ఉపాసనలోకే అంతర్భవిస్తుంది. శ్రీరామాయణంలో అంతటా శ్రీమన్నారాయణుడే పరదైవమనే వైదికసిద్ధాంతం పలుమార్లు పలు రీతులలో పలువురిద్వారా పలు సందర్భాలలో ఘోషింపబడింది కదా! ఈ ఆదిత్యహృదయం లోనే "బ్రహ్మేశానాచ్యుతేశాయ" ఇత్యాది సూక్తులద్వారా భగవానుడైన శ్రీమన్నా రాయణుని పరత్వం తెలుపబడింది కూడా. అందువల్ల ఏ సందేహానికి ఏవిధమైన అవకాశం లేదు. కనుక అంతా సమంజసం.

ఆదిత్యహృదయవ్యాఖ్యా నామ్నా హృదయరంజనీ ।
శింగరార్య కృతా భూయాత్ సారాసారవిదాం ముదే ॥





## అనుబంధం-1

# దేవశబ్దార్థ వివరణం

"దివు-క్రీడావిజిగీషా వ్యవహారద్యుతి స్తుతిమోదమదస్వప్న కాంతిగతిషు" (దివు- అనే ధాతువు క్రీడ, విజిగీష, వ్యవహారం, ద్యుతి, స్తుతి, మోదం, మదం, స్వప్నం, కాంతి, గతి- అనే అర్థాలలో ప్రయోగింప బడుతున్నది) అనే ధాతుపాఠాన్ని బట్టి దివుధాతువునకు పది అర్థాలున్నాయి. ఈ పది అర్థాలు భగవానునిపట్ల పొసగుతాయి. "దివ్యో దేవ ఏకో నారాయణః" అని వేదం, "భవాన్ నారాయణో దేవః" అని, "సాక్షాద్దేవో పురాణో- సౌ" అని మహర్షులు, "శిలైయినాల్ ఇలఙ్గై శె*ற்ற* దేవనే దేవనావాన్" అని ఆ*ழ*్వార్లు ఈ అర్థాన్ని సుస్థాపించారు.

**1.** (దివు-క్రీడాయామ్) అనే ధాతువునుండి పుట్టిన ఈ పదానికి సృష్టిస్థితి లయాలను క్రీడగా కలవాడని అర్థం. ఈ అర్థాన్ని "క్రీడా హరేరిదం సర్వం క్షరమిత్యవధార్యతామ్" (నశించే ఇవి అన్నీ హరియొక్క క్రీడయే అని గ్రహింపబడుగాక) అని, "క్రీడతో బాలకస్యేవ చేష్టాం తస్య నిశామయ, మోదతే భగవాన్ భూతైః బాలః క్రీడనకైరివ" (బాలకుడు ఆటవస్తువులతో ఆనందించేటట్లుగా, భగవానుడు ప్రాణులతో క్రీడిస్తున్నాడు) అని ఋషులు, "లోకవత్తు లీలాకైవల్యమ్" (లోకంలో, ప్రభువు మొదలైనవారికి వలె, భగవానునకుకూడా జగత్సృష్ట్యాదులు కేవలం లీలను ఫలంగా కల్గినవి) అని బాదరాయణుడు, "అఖిల భువనజన్మస్థేమ భంగాదిలీలే" (లోకాలు అన్నిటియొక్క సృష్టిస్థితి లయాదులను లీలగా కల్గినవాని విషయంలో) అని శ్రీరామానుజులు, "నాట్టై ప్పడై ఎన్ఱు అయన్ ముదలా త్తన్ద నళిర్ మామలరున్ది వీట్టై ప్పణ్ణి విళైయాడుమ్ విమలన్" అని గోదాదేవి, "ఇన్బుఱు మివ్విళైయాట్టుడైయాన్" అని నమ్మా*ழ*్వార్లు ఈ అర్థాన్ని తెలిపారు.

**2.** (దివు-విజిగీషాయామ్) జయించడంలో ఇచ్ఛను కలవాడు, కనుక దేవుడన బడుతున్నాడు - అని భావం. అంటే - చేతనులను "జితం తే పుండరీకాక్ష!" (పుండరీ కాక్షా! నీకు ఓడిపోయాము) అని, "తో*ற்ற*ోమ్ మడనెఞ్జమ్! ఎమ్బెరుమాన్ నారణఱ్కు" (ఓ భవ్యమైన మనసా! భగవానుడైన శ్రీమన్నారాయణునకు మనం పరాజితులం) అని అనేటట్లు చేయడం గొప్ప ఫలంగా భావించేవాడని భావం. "సత్యేన లోకాన్ జయతి" (సత్యమనే గుణంతో శ్రీరాముడు లోకాలను జయిస్తున్నాడు) అని "జితం భగవతా జగత్" (జగత్తు భగవానునిచే జయింపబడింది)

"నావిజిత్య నివర్తతే" (శ్రీరాముడు జయించకుండా తిరిగి రాడు) అని, "శెన్రు కొన్రు వెన్రికొణ్డ వీరన్" (పోయి వధించి జయించిన వీరుడు) అని మొదలైన సూక్తులలలో ఈ అర్థం తెలుపబడింది.

3. (దివు-వ్యవహారే) వేదం మొదలైన వాక్కులను వ్యవహరించేవాడు - పలికేవాడు కనుక దేవుడని అర్థం. "యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై" (ఎవడు సృష్టికి పూర్వం బ్రహ్మను సృష్టిస్తున్నాడో, ఎవడయితే ఆ బ్రహ్మకు వేదాలను అనుగ్రహిస్తున్నాడో) అని, "పాంచరాత్రస్య కృత్స్నస్య వక్తా నారాయణః స్వయమ్" (పాంచరాత్రానికి అంతటికి వక్త స్వయంగా నారాయణుడు) అని, "పీతకవాడైపిరానార్ పిరమకురువాకి వన్దు" (పీతాంబరధారి పరమాచార్యుడై వచ్చి), "ఇన్‌కవి పాడియ ఈశన్" (తీయని కవిత్వాన్ని పాడిన ఈశుడు), "తిరువరఙ్గర్ తామ్ పణిత్త మెయ్‌మ్మైప్పెరువార్‌త్తై" అని, "మత్తై యురైత్త తిరుమాల్" (వేదాలను ఉపదేశించిన శ్రియఃపతి) అని, "అన్నమాయ్ అన్రఙ్గు అరుమఱై పయన్దాన్" (హంస రూపియై అపుడు అక్కడ అరుదైన వేదాలను అనుగ్రహించాడు) అని ఈ రీతిలో చెప్పేటట్లుగా వేలాది ఉత్కృష్టవచనాలను పల్కినవాడు కదా భగవానుడు. కనుక దేవుడు.

లేక, "వ్యవహారం" మనే పదానికి - వాదించేవాడు - అనే అర్థం ఉన్నది కనుక, దేవశబ్దానికి వాదాలను పలికేవాడు- అనే అర్థాన్నికూడా గ్రహించవచ్చు. అంటే - జీవుడు "నేను నాకు చెందినవాడను" అని అంటే, అపుడు, "నీవు నాకు శేషభూతుడవు" అని వాదించి, అతనిని శేషభూతునిగా చేసికోవడానికి యత్నించేవాడని అర్థం. భగవానుడు ఈ విధంగా వాదించే రీతిని పరమరస్యంగా పరాశరభట్టర్ "త్వం మే-హం మే, కుతస్తత్, తదపి కుత, ఇదం వేద మూల ప్రమాణాత్, ఏతచ్చానాదిసిద్ధాత్ అనుభవవిభవాత్, సో-పి సాక్రోశ ఏవ, క్వాక్రోశః కస్య, గీతాషు మమ విదితః, కో-త సాక్షీ, సుధీ స్స్యాత్, హంత! త్వత్పక్షపాతీ స ఇతి నృకలహే మృగ్యమధ్యస్థవత్ త్వమ్" అనే శ్లోకరత్నంలో తెలిపారు.

4. (దివు-ద్యుతౌ) - ప్రకాశించేవాడు కనుక దేవుడు - అని ఇంకొక అర్థం. "తమేవ భాంత మనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి" (ప్రకాశించే ఆ పరమాత్మను అనుసరించి సమస్తం ప్రకాశిస్తున్నది. అతని ప్రకాశంచేతనే ఈ సమస్తం ప్రకాశిస్తున్నది) అని, "అథ యదతః పరో దివో జ్యోతి ర్దీప్యతే" (పరమపదం పైన ఏ జ్యోతి ప్రకాశిస్తున్నదో) అని, "నారాయణపరో జ్యోతిః" అని, వేదం "పరఞ్జోతి నీ పరమాయ్", "నిఱైన్ద శోది వెళ్ళమ్ శూழ్న్ద" (పూర్ణమైన జ్యోతిస్సుయొక్క ప్రవాహం



పరివేష్టించగా) అని, "శోదివెళ్ళత్తినుళ్ళే ఎழுవదోరురు" (జ్యోతిఃప్రవాహం లోపల ఆవిర్భవించే అద్వితీయరూపం) అని ఆళ్వార్లు, "తేజసాం రాశిమూర్జితమ్" అని మహర్షి భగవానుని అంతులేని జ్యోతిస్సును కలవాడని పలికారు కదా !

5. (దివు-స్తుతౌ) - స్తుతింపబడేవాడు కనుక, దేవుడని అర్థం. "తతో దేవాః ఊర్ధ్వబాహవః స్తువంతి" (దానికి పిమ్మట దేవతలు చేతులను పైకెత్తి స్తుతిస్తున్నారు) అని, "విపన్యవో జాగృవాంసః సమింధతే" (స్తుతిశీలురై, సదా మేల్కొని ఉండే నిత్యసూరులు ప్రకాశిస్తున్నారు) అని, "తస్య రుక్ చ సామ చ గేష్ణౌ" (ఋగ్వేదం, సామవేదం అతనిని స్తుతించేవి) అని వేదం, "స్తవ్యః స్తవప్రియః" (స్తుతించదగినవాడు, స్తుతిని ప్రియంగా కలవాడు) అని, "సంఘైస్సురాణాం స్తుతః" (దేవతల సంఘాలచేత త్రివిక్రముడు స్తుతింపబడ్డాడు) అని మహర్షులు "ఏత్త ఏమిలకుమ్" (ఏడు లోకాలు స్తుతించగా) అని, "యానుమేత్తి ఏழுలకుమ్ ముற்றுమేత్తి ప్పిన్నై త్తానుమ్ ఏత్తిలుమ్ తన్నై ఏత్త వేత్త ఎజ్జెయ్‌దుమ్" అని ఆழ்వార్లు పల్కిన రీతిలో సర్వశాస్త్రాలచే సమస్త చేతనులచే స్తుతింపబడేవాడు, కనుక దేవుడని భావం.

6. (దివు-మోదే) ఆనందాన్ని కలవాడు, ఆనందస్వరూపుడు, కనుక దేవుడని అర్థం. "విజ్ఞాన మానందం బ్రహ్మ" (విజ్ఞానస్వరూపుడు, ఆనందస్వరూపుడు, బ్రహ్మం) "యదేష ఆకాశ ఆనందో న స్యాత్", "ఆనందం బ్రహ్మేతి వ్యజానాత్" (పరమాత్మ ఆనందస్వరూపుడని తెలిసికొన్నాడు) అని వేదం. "ఇన్బమ్ పయక్క ఇనిదుడన్ వీற்றி రున్దాళ్‌కిట్ట ఎఙ్గళ్ పిరాన్" అని ఆళ్వార్లు పల్కిన రీతిలో ఆనందాన్ని స్వరూపంగా కలవాడు, కనుక దేవుడని భావం.

7. (దివు-మదే) అవాప్తసమస్తకాముడు కనుక, ఎవరిని లెక్కించకుండా ఉండడమనే మదాన్ని కలవాడు కనుక, దేవుడని భావం. "అవాక్యనాదరః" (ఎవరితోను మాటలాడే వాడు కాడు ఎవరిపట్ల ఆదరం లేనివాడు) అని వేదం ఈ అర్థాన్ని పల్కింది.

8. (దివు-కాంత్యామ్) - కంటికి ఆకర్షణీయమైన కాంతిని కలవాడు, కనుక దేవుడు. "విద్యుతః పురుషాత్" (విద్యుద్వర్ణాన్ని కల పురుషునివల్ల) అని, "నీలతోయద మధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్వరా" (నీలమేఘాన్ని మధ్యలో కల్గిన విద్యుల్లేఖవలె (గొప్ప కాంతిని కల్గినది) అని వేదం, "ప్రసన్నాదిత్యవర్చసమ్" (చల్లదనంలో చంద్రుని వంటి, తేజస్సులో సూర్యునివంటి కాంతిని కలవాడు) అని మహర్షి "ముళైక్కదిరై" అని తిరుమంగై ఆழ்వార్లు "కదిర్ మదియమ్ పోల్ ముకత్తాన్" (సూర్యుని, చంద్రుని

వంటి ముఖాన్ని కలవాడు) అని గోదాదేవి భగవానుని దేహకాంతియొక్క భోగ్యతను గూర్చి పలికారు. ఈ విధంగా నేత్రాలకు ఆకర్షణీయమైన కాంతిని కలవాడు కనుక దేవుడని భావం.

**9.** **(దివు-గతౌ)** ప్రాప్యమై, ప్రాపకమై ఉండేవాడు కనుక దేవుడని భావం. "పురుషాన్న పరం కించిత్ సా కాష్ఠా సా పరా గతిః" అని "శరణం గతి ర్నారాయణః " అని "నారాయణం పరాయణమ్" అని, "గతిర్గమ్యశ్చాసౌ హరిః" (ప్రాప్య ప్రాపకాలు హరియే), "నెఱిమైయాల్ నినైయవల్లార్ కతియినై" అని, "నెఱి వాశల్ తానేయాయ్ నిన్ఱానై" అని, "పదియే పరవిత్తొழுమ్ తొణ్డర్ తమక్కు పతియే" అనే రీతిలో గొప్ప ఉపాయమై, ఉపేయమై ఉండేవాడు కనుక దేవుడని భావం.





అనుబంధం - 2

# ఆదిత్యహృదయం

## ప్రార్థనా

### విష్వక్సేన ధ్యానమ్

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే ॥
యస్య ద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్ ।

విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం త మాశ్రయే ॥

### శ్రీహయగ్రీవ ధ్యానమ్

జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిమ్ ।
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే ॥

### వాల్మీకి ధ్యానమ్

కూజంతం రామ రామేతి మధురం మధురాక్షరమ్ ।
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలమ్ ॥

### శ్రీరామ ప్రార్థనా

శ్రీరాఘవం దశరథాత్మజ మప్రమేయం సీతాపతిం రఘుకులాన్వయరత్నదీపమ్ ।

ఆజానుబాహు మరవిన్దదళాయతాక్షం రామం నిశాచరవినాశకరం నమామి ॥

వైదేహీసహితం సురద్రుమతలే హైమే మహామణ్డపే
మధ్యే పుష్పకమాసనే మణిమయే వీరాసనే సుస్థితమ్ ।
అగ్రే వాచయతి ప్రభంజనసుతే తత్త్వం మునిభ్యః పరం
వ్యాఖ్యాంతం భరతాదిభిః పరివృతం రామం భజే శ్యామలమ్ ॥

ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదామ్ ।
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్ ॥

వాల్మీకే ర్మునిసింహస్య కవితా వనచారిణః ।
శ్రుణ్వన్ రామకథానాదం కో న యాతి పరాం గతిమ్ ॥

## అంజనేయ ప్రార్థనా

గోష్పదీకృతవారాశిం మశకీకృతరాక్షసమ్ ।
రామాయణ మహామాలారత్నం వందే-నిలాత్మజమ్ ॥

అంజనానందనం వీరం జానకీశోకనాశనమ్ ।
కపీశ మక్షహంతారం వందే లంకాభయంకరమ్ ॥

మనోజవం మారుతతుల్యవేగం జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్ ।
వాతాత్మజం వానరయూథముఖ్యం శ్రీరామదూతం శిరసా నమామి ॥

ఆంజనేయ మతిపాటలాననం కాంచనాద్రికమనీయవిగ్రహమ్ ।
పారిజాతతరుమూలవాసినం భావయామి పవమాననందనమ్ ॥

యత్ర యత్ర రఘునాథ కీర్తనం తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్ ।
బాష్పవారి పరిపూర్ణలోచనం మారుతిం నమత రాక్షసాంతకమ్ ॥

## శ్రీరామాయణ ప్రార్థనా

వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే ।
వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాత్ రామాయణాత్మనా ॥

చరితం రఘునాథస్య శతకోటిప్రవిస్తరమ్ ।
ఏకైకమక్షరం ప్రోక్తం మహాపాతకనాశనమ్ ॥

వాల్మీకిగిరిసంభూతా రామసాగరగామినీ ।
పునాతి భువనం పుణ్యా రామాయణ మహానదీ ॥

యః కర్ణాఞ్జలిసంపుటై రహరహ స్సమ్యక్పిబత్యాదరాత్
వాల్మీకే ర్వదారవిన్దగళితం రామాయణాఖ్యం మధు ।
జన్మవ్యాధిజరావిపత్తి మరణై రత్యంతసోపద్రవం
సంసారం స విహాయ గచ్ఛతి పుమా న్విష్ణోః పదం శాశ్వతమ్ ॥

తదుపగత సమాససంధియోగం సమమధురోపనతార్థ వాక్యబద్ధమ్ ।
రఘువరచరితం మునిప్రణీతం దశశిరసశ్చ వధం నిశామయధ్వమ్ ॥



## తరువాత గ్రంథానికి యథాశక్తి ఆరాధన చేయాలి

అస్య ఆదిత్యహృదయస్తోత్రస్య అగస్త్యః ఋషిః అనుష్టుప్ ఛందః, ఆదిత్యహృదయ భూతో భగవాన్ నారాయణః దేవతా, నిరస్తాశేషవిఘ్నతయా బ్రహ్మవిద్యాసిద్ధౌ సర్వత్ర జయసిద్ధౌ ఆరోగ్య సిద్ధౌ చ వినియోగః

## ధ్యానమ్

ధ్యేయస్సదా సవితృమండలమధ్యవర్తీ
నారాయణః సరసిజాసనసన్నివిష్టః ।
కేయూరవాన్ మకరకుండలవాన్ కిరీటీ
హారీ హిరణ్మయవపుః ధృతశంఖచక్రః ॥

జయత్యతిబలో రామో లక్ష్మణ శ్చ మహాబలః
రాజా జయతి సుగ్రీవో రాఘవే ణాభిపాలితః.

దాసో-హం కోసలేంద్రస్య రామ స్యాక్లిష్టకర్మణః,
హనుమాన్ శత్రుసైన్యానాం నిహంతా మారుతాత్మజః.

న రావణసహస్రం మే యుద్ధే ప్రతిబలం భవేత్,
శిలాభిస్తు ప్రహరతః పాదపై శ్చ సహస్రశః.

అర్దయిత్వా పురీం లంకా మభివాద్య చ మైథిలీం,
సమృద్ధార్థో గమిష్యామి మిషతాం సర్వరక్షసామ్.

ధర్మాత్మా సత్యసంధశ్చ రామో దాశరథి ర్యది ।
పౌరుషే చాప్రతిద్వంద్వ శ్శరైనం జహి రావణిమ్ ॥

తపస్స్వాధ్యాయనిరతం తపస్వీ వాగ్విదాంవరమ్ ।
నారదం పరిపప్రచ్ఛ వాల్మీకి ర్మునిపుంగవమ్ ॥

తరువాత 'శ్రీ రఘునన్దన పరబ్రహ్మణే నమః' అని పఠించి, ఆదిత్య హృదయాన్ని పారాయణం చేయాలి.

# ఆదిత్యహృదయం

1) తతో యుద్ధపరిశ్రాంతం సమరే చింతయా స్థితమ్ ।
రావణం చాగ్రతో దృష్ట్వా యుద్ధాయ సముపస్థితమ్ ॥

2) దైవతైశ్చ సమాగమ్య ద్రష్టుమభ్యాగతో రణమ్ ।
ఉపాగమ్యాబ్రవీత్ రామ మగస్త్యో భగవాన్ ఋషిః ॥

3) రామ! రామ! మహాబాహో! శృణు గుహ్యం సనాతనమ్ ।
యేన సర్వానరీన్ వత్స! సమరే విజయిష్యసి ॥

4) ఆదిత్యహృదయం పుణ్యం సర్వశత్రువినాశనమ్ ।
జయావహం జపేన్నిత్య మక్షయ్యం పరమం శివమ్ ॥

5) సర్వమంగళమాంగల్యం సర్వపాపప్రణాశనమ్ ।
చింతాశోకప్రశమన మాయుర్వర్ధనముత్తమమ్ ॥

6) రశ్మిమంతం సముద్యంతం దేవాసురనమస్కృతమ్ ।
పూజయస్వ వివస్వంతం భాస్కరం భువనేశ్వరమ్ ॥

7) సర్వదేవాత్మకో హ్యేషః తేజస్వీ రశ్మిభావనః ।
ఏష దేవాసురగణాన్ లోకాన్ పాతి గభస్తిభిః ॥

8) ఏష బ్రహ్మా చ విష్ణుశ్చ శివః స్కందః ప్రజాపతిః ।
మహేంద్రో ధనదః కాలో యమః సోమో హ్యపాం పతిః ॥

9) పితరో వసవః సాధ్యా హ్యశ్వినో మరుతో మనుః ।
వాయుర్వహ్నిః ప్రజాప్రాణా ఋతుకర్తా ప్రభాకరః ॥

10) ఆదిత్యః సవితా సూర్యః ఖగః పూషా గభస్తిమాన్ ।
సువర్ణసదృశో భానుః హిరణ్యరేతా దివాకరః ॥

11) హరిదశ్వః సహస్రార్చిః సప్తసప్తిర్మరీచిమాన్ ।
తిమిరోన్మథనః శంభుః త్వష్టా మార్తాండ అంశుమాన్ ॥

12) హిరణ్యగర్భః శిశిరః తపనో భాస్కరో రవిః ।



అగ్నిగర్భో-దితేః పుత్రః శంఖః శిశిరనాశనః ॥

13) వ్యోమనాథ స్తమోభేదీ ఋగ్యజుస్సామపారగః ।
ఘనవృష్టి రపాంమిత్రో వింధ్యవీథీ ప్లవంగమః ॥

14) ఆతపీ మండలీ మృత్యుః పింగళః సర్వతాపనః ।
కవి ర్విశ్వో మహాతేజాః రక్తః సర్వభవోద్భవః ॥

15) నక్షత్రగ్రహతారాణా మధిపో విశ్వభావనః ।
తేజసామపి తేజస్వీ ద్వాదశాత్మన్! నమో-స్తు తే ॥

16) నమః పూర్వాయ గిరయే పశ్చిమే గిరయే నమః ।
జ్యోతిర్గణానాం పతయే దినాధిపతయే నమః ॥

17) జయాయ జయభద్రాయ హర్యశ్వాయ నమో నమః ।
నమో నమః సహస్రాంశో ఆదిత్యాయ నమో నమః ॥

18) నమ ఉగ్రాయ వీరాయ సారంగాయ నమో నమః ।
నమః పద్మప్రబోధాయ మార్తాండాయ నమో నమః ॥

19) బ్రహ్మేశానాచ్యుతేశాయ సూర్యాయాదిత్యవర్చసే ।
భాస్వతే సర్వభక్షాయ రౌద్రాయ వపుషే నమః ॥

20) తమోఘ్నాయ హిమఘ్నాయ శత్రుఘ్నాయామితాత్మనే ।
కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాం పతయే నమః ॥

21) తప్తచామీకరాభాయ వహ్నయే విశ్వకర్మణే ।
నమస్తమో-భినిఘ్నాయ రుచయే లోకసాక్షిణే ॥

22) నాశయత్యేష వై భూతం తదేవ సృజతి ప్రభుః ।
పాయత్యేష తపత్యేష వర్షత్యేష గభస్తిభిః ॥

23) ఏష సుప్తేషు జాగర్తి భూతేషు పరినిష్ఠితః ।
ఏష ఏవాగ్నిహోత్రం చ ఫలం చైవాగ్నిహోత్రిణామ్ ॥

24) వేదాశ్చ క్రతవశ్చైవ క్రతూనాం ఫలమేవ చ ।
యాని కృత్యాని లోకేషు సర్వ ఏష రవిః ప్రభుః ॥

25) ఏన మాపత్సు కృచ్ఛ్రేషు కాంతారేషు భయేషు చ ।
కీర్తయన్ పురుషః కశ్చిత్ నావసీదతి రాఘవ! ॥

26) పూజయస్వేన మేకాగ్రో దేవదేవం జగత్పతిమ్ ।
ఏతత్త్రిగుణితం జప్త్వా యుద్ధేషు విజయిష్యసి ॥

27) అస్మిన్ క్షణే మహాబాహో! రావణం త్వం వధిష్యసి ।
ఏవముక్త్వా తదా-గస్త్యో జగామ చ యథాగతమ్ ॥

28) ఏతత్ శ్రుత్వా మహాతేజా నష్టశోకో-భవత్తదా ।
ధారయామాస సుప్రీతో రాఘవః ప్రయతాత్మవాన్ ॥

29) ఆదిత్యం ప్రేక్ష్య జప్త్వాతు పరం హర్ష మవాప్తవాన్ ।
త్రిరాచమ్య శుచిర్భూత్వా ధనురాదాయ వీర్యవాన్ ॥

30) రావణం ప్రేక్ష్య హృష్టాత్మా యుద్ధాయ సముపాగమత్ ।
సర్వయత్నేన మహతా వధే తస్య ధృతో-భవత్ ॥

31) అథ రవి రవదన్నిరీక్ష్య రామం
ముదితమనాః పరమం ప్రహృష్యమాణః ।
నిశిచరపతిసంక్షయం విదిత్వా
సురగణమధ్యగతో వచ స్త్వరేతి ॥

ఇతి శ్రీరామాయణే యుద్ధకాండే సప్తాధికశతతమసర్గః
ఆదిత్యహృదయం సంపూర్ణమ్



## పారాయణం చివర పఠించవలసిన శ్లోకాలు

ఏవమేతత్పురావృత్త మాఖ్యానం భద్రమస్తు వః ।
ప్రవ్యాహరత విస్రబ్ధం బలం విష్ణోః ప్రవర్ధతామ్ ॥



లాభస్తేషాం జయస్తేషాం కుత స్తేషాం పరాభవః ।
యేషా మిన్దీవరశ్యామో హృదయే సుప్రతిష్ఠితః ॥

కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్యశాలినీ ।
దేశో-యం క్షోభరహితో బ్రాహ్మణా స్సన్తు నిర్భయాః ॥

కావేరీ వర్ధతాం కాలే కాలే వర్షతు వాసవః ।
శ్రీరఙ్గనాథో జయతు శ్రీరంగ శ్రీ శ్చ వర్ధతామ్ ॥

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయన్తాంన్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః ।
గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం లోకా స్సమస్తా స్సుఖినో భవన్తు ॥

మఙ్గళం కోసలేన్ద్రాయ మహనీయగుణాబ్ధయే ।
చక్రవర్తి తనూజాయ సార్వభౌమాయ మంగళమ్ ॥

అసాద్య నగరీం దివ్యా మభిషిక్తాయ సీతయా ।
రాజాధిరాజరాజాయ రామభద్రాయ మఙ్గళమ్ ॥

మఙ్గళాశాసనపరై ర్మదాచార్యపురోగమైః ।
సర్వైశ్చ పూర్వై రాచార్యై స్సత్కృతాయాస్తు మఙ్గళమ్ ॥

కాయేన వాచా మనసేంద్రియై ర్వా బుద్ధ్యా త్మనా వా ప్రకృతే స్స్వభావాత్ ।
కరోమి యద్యత్ సకలం పరస్మై నారాయణాయేతి సమర్పయామి ॥

యదక్షర పదభ్రష్టం మాత్రాహీనం చ యద్భవేత్ ।
తత్సర్వం క్షమ్యతాం దేవ నారాయణ నమోస్తు తే ॥

పారాయణ చేసిన తర్వాత చివరిలో యథాశక్తి పాలనుగాని, పండ్లను గాని, పాయసాన్నాన్ని గాని నివేదన చేసి, కర్పూర హారతిని ఇవ్వాలి. ఈవిధంగా పారాయణను ఒక మండలకాలం - అంటే - 40 రోజుల పాటు చేయాలి. ఈ స్తోత్రాన్ని ఆచార్యుల వద్ద ముందుగా ఉపదేశంగా పొంది, తర్వాత పారాయణం చేయడం పెద్దల ఆచారం.

